మహిళా ఉద్యమ కరదీపిక

# చైతన్య మానవి



ద్వైమాసపత్రిక

సెప్టెంబర్ - అక్టోబర్, 2016

## పోలీసుల రక్షణ

## ప్రజలకా ? పరిశ్రమలకా...?




తిరుమల తిరుపతి దేవస్థానములు: తిరుపతి

# శ్రీ బాలాజి వికలాంగుల శస్త్రచికిత్స పరిశోధన మరియు పునరావాస కేంద్రం(బర్డ్)







శ్రీ బాలాజి ఇనిస్టిట్యూట్ ఆఫ్ సర్జరీ, రీసెర్చ్ అండ్ రిహాబిలిటేషన్ ఫర్ ది డిజేబుల్డ్(బర్డ్) ట్రస్టు ఒక ప్రముఖ వైద్య సంస్థ. మానవ సేవయే పరమావధిగా భావించి శారీరక వికలత్వముతో బాధపడు వారికి సేవచేస్తూ ఉపశమనం కలుగ చేయుట కొరకు ఈ సంస్థ తి.తి.దే చే స్థాపించడమైనది. పోలియో మైలిటిస్, సెరిబ్రల్ పాల్సీ, కన్‌జెనిటల్ అనోమలిస్, స్పైనల్ ఇంజ్యూరిస్, మరియు ఆర్థోపెడికల్లీ హ్యాండిక్యాప్డ్ వ్యాధిగ్రస్తులకు ఈ ఆసుపత్రిలో విలువైన చికిత్సలు చేస్తూ నిరుపేదల సేవలో అంకితమై పూర్తి బాధ్యలతో సేవలందిస్తున్నది. ఈ ఆసుపత్రి ఆధునిక వైద్య పరికరములతో పాటు సెంట్రల్లీ ఎయిర్ కండీషన్ కలిగి ఉన్నది.

బర్డ్ చికిత్సలో ఆధునిక వైద్యసాంకేతిక పరిజ్ఞానం ఉపయోగించి నిరుపేదలకు ఉచితంగా సేవలందిస్తుంది. అదేవిధంగా ఆప్తులకు మరియు నిరుపేదలకు కృత్రిమ అవయవాలు, క్యాలిపర్స్ మరియు చికిత్సతోపాటు భోజనము మరియు మందులను కూడా ఉచితంగా వితరణ చేసి సహాయమందిస్తుంది. దయాళువులు విరివిగా విరాళాల్వండి. ఇప్పించండి. బర్డ్ ఇన్‌పేషెంట్స్ యొక్క సేవల కొరకు మీవంతు సహకారంగా ఈ పేరొందిన వైద్య సంస్థకు అందించిన వితరణను తి.తి.దే. ఆమోదిస్తున్నది.

## విరాళం సొమ్ము

ఈ పథకం కొరకు కనీస విరాళం రూ.లు 1000/-, రూ.లు.1000/-ల కంటే తక్కువగల విరాళం శ్రీవారి హుండీ ఖాతాకు దాతకు ఎట్టి సమాచారం లేకుండా జమచేయబడును. అన్ని విరాళాలు ఒక జాతీయ బ్యాంకులో డిపాజిట్ చేయబడతాయి. మరియు వాటి మీద ప్రోగుపడే వడ్డీ ఈ పథకం కొరకు వినియోగించడుతుంది.

'దిఎగ్జిక్యూటివ్ ఆఫీసర్, బర్డ్ పథకం తి.తి.దే., తిరుపతి' వారి పేరిట ఏదేని షెడ్యూలు బ్యాంకు మీద తీసిన చెక్కు/డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా విరాళాలను ది డైరెక్టర్, బర్డ్, తి.తి.దే., తిరుపతి-517501 ఫోన్ 0877-2264619 వారికి పంపవచ్చును.

వ్యక్తులు, సంస్థలు, కంపెనీలు వగైరా విరాళాలను ఇవ్వవచ్చును. మరియు వారు భారతీయ ఆదాయపు పన్ను చట్టం యొక్క సెక్షన్-80(జి) క్రింద ఆదాయపు పన్ను ప్రయోజనాన్ని పొందడంతో పాటు ఏకీకృత ప్రయోజనాల కొరకు అర్హులవుతారు.

బర్డ్‌కు రూ.లు 10 లక్షలు మరియు ఆపై విరాళమిచ్చిన దాతలకు ప్రత్యేక ప్రయోజనాలు కల్పించబడును మరియు బర్డ్ ఆసుపత్రినందు దాత పేరుమీద ఒక గది ఏర్పాటు చేసి దాత పేరును గది వద్ద ఏర్పాటు చేయబడును.

...శుభాకాంక్షలతో...



# చౌదరి పురుషోత్తమ నాయుడు

రాష్ట్ర సహాధ్యక్షులు

APNGGOs అసోసియేషన్, శ్రీకాకుళం.

...హార్ధిక శుభాకాంక్షలతో...





శ్రీమతి **విశ్వాసరాయి కళావతి** గారు

ఎమ్మెల్యే, పాలకొండ నియోజకవర్గం,

శ్రీకాకుళం జిల్లా.

సంపాదకీయం

చైతన్య మానవి

# ప్రజాస్వామ్యం పేరిట కార్పొరేట్ స్వామ్యం

మీకు పెద్దన్నను. మీ పోరాటంలో మీతో ఉంటాను. అక్రమంగా ఒక్క ఎకరం కూడా తీసుకోనివ్వనని నాడు మాట ఇచ్చిన "బాబు" గద్దెనెక్కితే పంపాది పేట గ్రామస్తులు సంబరాలు చేసుకున్నారు. గద్దెనెక్కిన బాబు నేడు నలుగురు కూడి నవ్వుకోరాదంటూ144వ సెక్షన్ విధించారు. ఆ ఒక్క గ్రామమే కాదు శకునాల, వంశధార, హిందూపూర్, నక్కపల్లి, భీమిలి, కొవ్వాడ, కాకినాడ ఒకటేమిటి రాష్ట్రమంతా నిర్బంధమే. మెగా ఆక్వా ఫుడ్ పార్క్ నిర్మాణం జరిగితే ఊరు వల్లకాడవుతుందని గ్రామ ప్రజలతో కలిసి ఫ్యాక్టరీ గేటుముందు బైఠాయించారు తుందుర్రు, జొన్నల గరువు, బేతపూడి గ్రామస్తులు. ఆందోళనకారులపై సెక్షన్ 307క్రింద కేసులు బనాయించారు. ఏడు నెలల తరువాత పోలీసులను దింపి ఫ్యాక్టరీ నిర్మాణం దౌర్జన్యంగా చేసేందుకు పూనుకున్నారు. సత్యవతి ఓ అమ్మ. ఆ ఊరు ఏ అధికారి వచ్చినా ఆమె చేతి వంట రుచి చూడాల్సిందే. ఎక్కడుంది ఇప్పుడు? తణుకు సబ్ జైల్లో! చేసిన నేరమేమిటి? ఆమెపై మోపిన నేరం హత్యా ప్రయత్నం. "మానవత" అనే సంస్థ నిర్వహించిన ప్రదర్శనకు వెళ్ళిన అమెను ఐపిసి 307 క్రింద అరెస్ట్ చేసి జైలుకంపారు. ఆమె బయటకొస్తే ప్రమాదమని బెయిల్ పిటీషన్‌ను వ్యతిరేకించారు పోలీసులు.

టీడీపి పార్టీ తరపున ఎమ్‌పిటిసి మెంబర్‌గా ఎన్నికయిన వెంకట రమణ ఫుడ్ పార్క్ నుండి వచ్చే కాలుష్యంతో మంచినీరు కూడా దొరకదని పై నాయకులకు చెప్పారు. పెద్దల తలకెక్కలేదు. పైగా కంపెనీ ప్రతినిధుల నుండి ఆ కుటుంబానికి భారీ ఆఫర్లు వచ్చాయి. వాటిని తిరస్కరించి ప్రజలతో నిలబడినందుకు ఆమె భర్త మీద కేసులు. ఒంటరిగా వున్న ఆమె ఇంటిపై పోలీసుల వేట.

అన్నవరం సత్యనారాయణ స్వామి పాదాల చెంత నుండి ప్రవహించే పంపానది నీటితో పరవశించే పచ్చటి పొలాలతో అలరారే గ్రామం పంపాదిపేట. స్వచ్ఛ సముద్ర జలాలలో అపురూపంగా పెరిగే రొయ్య పిల్లల పెంపకం కేంద్రాలు. చుట్టూ జీడిమామిడి తోటలు. అక్కడ పారిశ్రామిక సముదాయం కోసం రాజశేఖర రెడ్డి ప్రభుత్వం కారుచౌకగా భూములను సేకరించటం మొదలెట్టింది. ఆనాడు వ్యతిరేకించిన టి.డి.పి నేడు దివీస్ ఫార్మాస్యూటికల్ కంపెనీకి 505 ఎకరాల భూమిని కట్టబెట్టింది. ప్రజాభిప్రాయానికి భిన్నంగా కలెక్టర్ రిపోర్ట్ పంపించారు. వేలమంది పోలీసులను దింపి మందుల కంపెనీ నిర్మాణాన్ని మొదలు పెట్టించింది. మా భూముల్లో ఇదేమిటని ప్రశ్నించిన జనాన్ని అక్రమంగా అరెస్టులు చేస్తున్నారు. బిడ్డలున్న తల్లులు సుదూర పోలీస్ స్టేషన్‌లలో తల్లడిల్లుతున్నారు. మగవాళ్ళు ఎక్కడున్నారో చెప్పమంటూ భయబ్రాంతులు సృష్టిస్తున్నారు.

బజారుకు రాని తల్లులు ఏంది బిడ్డా ఈ ఘోరం? అని ప్రశ్నిస్తే ప్రైవేటు గూండాల దాడి. అరెస్టులు, జైళ్ళు.

అమరావతి రాజధానికి 35 వేల ఎకరాలు సేకరించిన సమర్థుడికి శకునాల రైతులకు నష్టపరిహారం చెల్లించటం ఎందుకు చేతకాలేదు? పట్టిసీమను రికార్డు స్థాయిలో కట్టిన నేతకు వంశధార నిర్వాసితులకు పునరావాసం కల్పించడం చేతకాలేదా? నిన్ను నమ్మి ఓటేసిన ప్రజలు పోరాట బాట పట్టినా జనంపై ఉక్కుపాదం దివీస్ కంపెనీ కోసమా? ఫుడ్‌పార్క్ కోసమా? విదేశీయుల కంచాల్లో రుచికరమైన రొయ్యలు, చేపల కోసం పొలాలన్నీ చెరువు కుంటలుగా మారుతున్నాయి. ఫుడ్‌పార్క్‌తో చెరువు కుంటలు సైతం కాలుష్య కాసారాలుగా మారనున్నాయి. మత్స్యకారులు రొయ్యల కంపెనీల కూలీలు అవుతున్నారు. భూములు కోల్పోయిన రైతులు కాందిశీకులు అవుతున్నారు.

సామాన్యులను భయకంపితులను చేసి కార్పొరేట్ కలలకు వింజామరలు వీస్తున్నారు పాలకులు. చరిత్రలో మట్టి కలిసిన నియంతల జాడలలో అంగలేస్తున్నారు. ప్రజాస్వామ్యం మేడిపండు చందమైంది. ప్రజాసేవ పేర ప్రజలమీద సవారీ చేస్తున్నారు. కంపెనీల ప్రైవేటు సైన్యానికి పోలీసుల ఖాకీ చొక్కాలను కాపలాపెట్టారు. నిరంకుశ కార్పొరేట్ యంత్రాంగానికి ప్రభుత్వము, అధికారులు, లాయర్లు కొండకొచో న్యాయమూర్తులు, పత్రికల వాళ్ళు సలాములు చేస్తున్నారు. తమ బ్రతుకే ప్రమాదంలో పడిన నేపథ్యంలో ప్రశ్నిస్తే అది అధికార కేంద్రాన్నే ప్రశ్నించటం అయింది. అణచివేత ద్వారా అభివృద్ధి పేర జీవితాలనే దుంప నాశనం చేయొద్దని ఉద్య మించే అమ్మలు, చెల్లెళ్ళు, తమ్ముళ్ళు విజయం సాధించాలని కోరుకుందాము. వారి గళానికి కలాన్నిద్దాం. స్వచ్ఛ భారత్ కావాలంటే అందరూ బతకగలిగే కాలుష్యం లేని పరిశ్రమలు కావాలని బదులిద్దాం. హక్కుల ఆలంబనతో నిర్బంధాన్ని అధిగమిద్దాం. అన్నం పెట్టే భూమితల్లి కంపెనీల సొత్తు కాదని చాటుదాం.

# చైతన్య మానవి

## ఈ సంచికలో



**అడ్వయిజరీ బోర్డు**

వేములపల్లి సత్యవతి
డాక్టర్ వకుళాభరణం లలిత
డాక్టర్ బి. విజయభారతి
డాక్టర్ శిలాలోలిత

**అఖిల భారత ప్రజాతంత్ర మహిళా సంఘం**
**ఎ.పి. రాష్ట్ర కమిటీ**

చిరునామా :
ఐద్వా రాష్ట్ర కార్యాలయం,
ప్రకాశరావు వీధి, మారుతీ నగర్,
ఏలూరు రోడ్డు, విజయవాడ-4
ఫోన్, 9490098620, 9490098022
E-mail : Chaitanyamanavi@gmail.com

సంపాదకులు
**డి. రమాదేవి**

సంపాదక వర్గం
**కె. స్వరూపరాణి**
**బి. ప్రభావతి**

మేనేజర్
**ఎం. సుధ**

**విరాళం రూ : 10/-**

**ప్రజాశక్తి డైలీ ప్రింటింగ్ ప్రెస్, కృష్ణనగర్, తాడేపల్లి మండలం, గుంటూరు జిల్లా**

పత్రికలో విభిన్న అంశాలపై వస్తున్న వ్యాసాలు రచయితల అభిప్రాయాలు మాత్రమే. అందులో పేర్కొన్న అన్ని అంశాలతో మానవి సంపాదక వర్గం ఏకీభవిస్తుందని భావించవలదు.

**- ఎడిటర్**

వ్యాసం

# యుగయుగాల స్త్రీ శక్తి సందేశం దసరా

- తిలకపల్లి రవి

స్త్రీలను గౌరవించడం మన సంప్రదాయం అంటూనే వారిపై అత్యాచారాలకూ అమానుషాలకూ అసభ్యతలకూ అసమానతలకూ పాల్పడటం పరిపాటి గా మారిన కాలంలో మహిళా శక్తిని ప్రతి బింబించే కనకదుర్గ పండుగ దసరా ప్రత్యేకత తప్పక చెప్పుకోవలసిందే. జయ జయహే మహిషాసుర మర్దిని రమ్య కపర్దని శైలసుతే అని అదేపనిగా పూజలు పురస్కారాలు చేసే సమాజంలో నిజంగా మర్దించవలసిన వారెవరో తెలుసుకోవ లసిందే. అమ్మను బొమ్మగా మార్చే సంస్కృ తిని ఛేదించి ఉన్నత స్థానంలో పున్ణప్రతి ష్టించడమే జరగాల్సిన పని. కేవలం సౌకుమార్యం కన్నా శౌర్య ప్రతా పాలు ప్రతిభాపాటవాలు స్త్రీకి ముఖ్యమన్నది నవరాత్రి సంకేతం. స్త్రీల జీవితాల తో ఆటలాడుకునేవారిని తక్కువ చేసే వారిని సహించరాదన్నది దసరా సందేశం.

దసరా పండుగ అన్నిటికీ మించి అమ్మ పండుగ. కొలువు తీరే కనక దుర్గమ్మ వేల సంవత్సరాల అమ్మదేవతకు ప్రతీక. అమ్మవారి విగ్రహాలు మతాల, మాతల పరిణామ క్రమమంతా ప్రతిబింబిస్తాయి. ఆమెను ఆదిశక్తి అంటున్నారు గాని నిజానికామె ఆడశక్తి. మహిళల మహోన్నత పాత్రకు సంకేతం. సమాజంలో స్త్రీల పాత్ర కుదించినట్టే పండుగల్లోనూ ఆ ప్రభావం తగ్గిపోయి ఒక్క నవరాత్రి మాత్రమే మిగిలిపోయింది. రాజకీయాల్లో మూడో వంతు రిజర్వేషన్లు కూడా ఆమోదం తెలపని ఈ సమాజం ఆధ్యాత్మిక విశ్వాసాలతో మొదలు పెట్టి మహిళల శక్తియుక్తులను తక్కువ చేస్తూ సహాయ కులుగా ఇంకా చెప్పాలంటే సేవకులు, భోగసాధనాల స్థాయికి దిగజార్చింది.

పురుష దేవతా ప్రపంచంలో ఏకైక మహిళా ప్రతినిధిగా నిలబడిన శక్తి స్వరూపిణి దుర్గ. మెడలో పుర్రెలతో సింహారూఢయై, రక్తపు నాలుక బయటకు సాచిన దుర్గ మహిషాన్ని వధించే చిత్రాలు నాల్గవ శతాబ్ది నుంచి దర్శన మివ్వడం ప్రారంభమైంది. ఆరవ శతాబ్దినాటికి దుర్గ ప్రసిద్ధ దేవతగా ఆవిర్భవించింది. మధ్యయుగాలకు వచ్చేసరికి దుర్గ విష్ణువును పోలిన లక్షణాలతో పూజలందుకోసాగింది. మధుకైటభులనే రాక్షసులను సంహరించేందుకు ఆమె విష్ణువు నుంచే అవతరించిందని విష్ణు పురాణ కథ. స్కంద పురాణం ప్రకారమైతే దుర్గ అనే రాక్షసి ప్రపంచాన్ని పీడిస్తుంటే శివుడి ఆదేశంపై పార్వతి ఆ రాక్షసిని సంహరిస్తుంది. అప్పటి నుంచి ఆమెకు ఆ పేరే స్థిరపడుతుంది. శంభు నిశుంభులనే రాక్షసుల సంహార గాథలోనూ ఇదే విషయం. ఇలా రకరకాల కథలున్నాయి. వీటన్నిటిలోనూ దుర్గ తనుగానే పోరాడుతుంది. ఇక అత్యధికంగా చెప్పుకునే మహిషాసుర మర్ధిని కథ. మహిషుడు స్త్రీచేతుల్లో తప్ప చనిపోకుండా వరం పొందుతాడు. (స్త్రీ ఎలాగూ చంపలేదని వాడి ఉద్దేశం) కాని పురాణ కథల ప్రకారమే దుర్గ . ఎందరో దేవతల శక్తి స్త్రీ రూపం తీసుకుని ప్రపంచమంతా వ్యాపిస్తుంది. శివుడి నుంచి మొహం, యముడి నుంచి శిరోజాలు, విష్ణువు నుంచి చేతులు ఇలా వచ్చి చేరతాయి. వారి ఆయుధాలు కూడా వస్తాయి. అంటే దేవతగా



చూపుతూనే ఆ శక్తి పురుష దేవుళ్ల నుంచి వచ్చిందని చెప్పడం. దేవీ భాగవతంలో ఆమెకూ మహిషాసురుడికీ మధ్య సుదీర్ఘ వాదన కూడా నడుస్తుంది. స్త్రీ అబల అని, ఆమె ప్రేమకు తప్ప ఇంకెందుకూ పనికిరాదని తూలనాడిన మహిషుడు ఆమె చేతిలో హతుడవుతాడు. పార్వతి సృష్టించిన వినాయకుడిని ఈశ్వరుడు చంపి బతికించడం ప్రసిద్ధమైన కథ. ప్రాచీన కాలంలోని ఒక చిత్రంలో దుర్గ సంహరించిన మహిషుడు ఈశ్వరాకా రంలో ఉంటాడు. తర్వాత అందులో నుంచి ఒక అందమైన యువకుడు వచ్చి ఆమెను పెళ్ళి చేసుకుంటాడు. మహారాష్ట్రలోనైతే మహిషుడ్ని మొదటి రోజు సంహరించి మరుసటి రోజు పెళ్లి చేసుకున్నట్టు భావిస్తారు.

రామాయణంలో సీత భూమిలో నుంచి జనించడంలోనూ అమ్మ దేవత లక్షణాలున్నాయి. భారతంలో పాండవుల జననంలో, కర్ణుని పుట్టుకలోనూ కూడా మాతృస్వామిక లక్షణాలను మనం చూడొచ్చు. నీటిలో, కుండలో పుట్టారని చెప్పే సందర్భాలన్నీ అమ్మ దేవతలకు ప్రతీకలని

కోశాంబీ వివరిస్తారు. దేవీ నవరాత్రుల తర్వాత పదోరోజు నుంచీ ఆలయాన్ని మూసేసే పద్ధతి చాలా చోట్ల ఉంది. అమ్మ మళ్లీ శక్తి పుంజుకుని మానవ సృష్టికి ఉపక్రమించాలనే భావనే ఇందుకు మూలం.

భూగోళంపై ఎక్కడ ఏ మానవ సమూహాన్ని తీసుకున్నా అన్నిటికీ ఆది బిందువు అమ్మ భావన. మరో ప్రాణికి జన్మనివ్వడం ఆడవాళ్ల ద్వారానే అవుతుంది గనుక వారినే పూజించారు. మొలిచే మొక్కలూ, పండే పంటలూ అన్నిటిలోనూ స్త్రీ రూపాన్ని చూశారు. ప్రకృతిని అమ్మగా కొలిచారు. తొలుత పూజలందుకున్నవి అమ్మ జననాంగాలు (తర్వాతే లింగపూజ). ప్రసవం రక్తంతో ముడిపడి ఉంది. అందుకు ముందూ రక్తస్రావం అమ్మలో కనిపిస్తుంది. రక్తానికి సంకేతమైన ఎరుపు పవిత్రత పొందింది. రాతి యుగపు దేవత లందరూ స్త్రీలే. హరప్పా శిథిలాలలో అమ్మదేవతలకు సంబంధిం చిన ప్రతిమలు, ప్రతీకలు ఎన్నో, నేలమ్మ, చెట్టమ్మ, గంగమ్మ, ఎల్లలు కాచే ఎల్లమ్మ, పొలిమేరమ్మ, బతుకునిచ్చే బతకమ్మ, కోపమొస్తే వ్యాధులు తెచ్చే ఆటలమ్మ, పెద్దమ్మ ఇలా అన్నిటిలోనూ అమ్మ విశ్వరూపమే.

ఇదంతా ఆర్యుల రాకకు ముందు సంగతి. వారు ఇక్కడకు వచ్చేట ప్పటికి పశు పోషకులుగా, వేటగాళ్లుగా, ఆహార సేకరణ చేసే సంచార కులుగా ఉన్నారు. యుద్ధ ప్రియులు. వ్యవసాయం గురించి తెలియదు. వ్యవసాయంలో పశువులను ఉపయోగించడంతో వ్యవసాయం పురుషుల చేతిలోకి మారింది. అంతకు ముందున్న అమ్మదేవత వెనక్కు పోయింది.



ఆర్యులు విస్తరిస్తున్న కొద్దీ అనార్య తెగలను తమతో కలుపుకోక తప్పలేదు. ఉభయుల విశ్వాసాలూ సర్దుబాటు అయ్యాయి. బౌద్ధ జైనాలను ఎదుర్కోవడానికి భక్తి సంప్రదాయం పెరిగింది. దేవతల ప్రాధాన్యతలు మారాయి. అంతకుముందు అందరి కన్నా గొప్ప దేవుడైన ఇంద్రుడు వెనక్కుపోయి, ఉపేంద్రుడైన విష్ణువు కేంద్ర స్థానంలోకి వచ్చాడు. అమ్మ దేవతలకూ స్థానం లభించింది. అయితే దేవుళ్ల భార్యలుగా మాత్రమే లక్ష్మి, పార్వతి, సరస్వతి తదితరులు వెలిశారు.

అంతకుముందు అమ్మదేవతలు బలంగా, భయంకరంగా ఉంటే ఇప్పుడు సుకుమారంగా మారి పోయారు. దేవీ నవరాత్రులు సందర్భంలో దుర్గను ఆదిశక్తి అని అభివర్ణిస్తారు. సృష్టి, స్థితి లయ కారకులున్నప్పుడు ఇలా ఆమెకు ఆదిస్థానం ఇవ్వడం ఆసక్తికరమైన విషయం. ఇంతా చేసి ఆమె శివుడు భార్య అంటారు. అన్నట్టు శివుడు కూడా అక్షరాలా అనార్య దేవుడు. తర్వాతే ఆయన గురించిన కథలు మారాయి.

**రామాయణంలో సీత భూమిలో నుంచి జనించడంలోనూ అమ్మ దేవత లక్షణాలున్నాయి. భారతంలో పాండవుల జననంలో, కర్ణుని పుట్టుకలోనూ కూడా మాతృస్వామిక లక్షణాలను మనం చూడొచ్చు. నీటిలో, కుండలో పుట్టారని చెప్పే సందర్భాలన్నీ అమ్మ దేవతలకు ప్రతీకలని కోశాంబీ వివరిస్తారు. దేవీ నవరాత్రుల తర్వాత పదోరోజు నుంచీ ఆలయాన్ని మూసేసే పద్ధతి చాలా చోట్ల ఉంది. అమ్మ మళ్లీ శక్తి పుంజుకుని మానవ సృష్టికి ఉపక్రమించాలనే భావనే ఇందుకు మూలం.**

పురాణాల ప్రవచనాలలో కనిపించని ఎంతో మంది దేవతలు కింది కులాల వారి పూజలందుకుంటూనే ఉన్నారు. వారిని క్షుద్రదేవతలని పండితులు ఈసడిస్తుంటారు. ఈ దేవతల పూజారులు గణాచార్లు కూడా స్త్రీలు లేదా వెనకబడిన వారే ఉంటారు. మూఢత్వాన్ని గుర్తిస్తూనే మానవాభివృద్ధి క్రమంలో మాతృమూర్తి ప్రతిరూపాలుగా వారిని గుర్తించవలసి ఉంటుంది. అలంపురంలోని జోగులాంబ శక్తిపీఠం, విజయవాడ కనకదుర్గమ్మతో సహా అమ్మదేవతల ఆలయాలు ఎన్నో ఉన్నాయి.

దసరాకు సమాంతరంగా బతకమ్మ పండుగ కూడా జరుగుతుంది. సమాజ పరిణామాన్ని అధ్యయనం చేయడానికి పనికివచ్చే సంగతులే ఇవన్నీ. అమ్మ అన్నది కేవల సెంటిమెంటు కాదు. అమ్మ ప్రకృతిలో, సమాజంలో తొలి సత్యం. నిజానికి మహిళలను అమ్మగా మాత్రమే చెప్పడం కూడా పాక్షికత్వమే. వారికి స్వంత వ్యక్తిత్వం శక్తిత్వం వుంటాయి. స్త్రీ పురుష భేదాలు ప్రాకృతికమైనవి తప్ప హెచ్చుతగ్గులను తీసుకురావు. పునరుత్పత్తికి అంటే మరో బిడ్డకు జన్మనివ్వగల శక్తి మహిళకు మాత్రమే

వుంది గనక వారి నాయకత్వానే మాతృస్వామికం నడిచింది. దాన్ని కోల్పోవడం మానవ సమాజ చరిత్రలో స్త్రీకి అతి పెద్ద ఓటమి అంటాడు ఫ్రెడరిక్ ఎంగెల్స్. ఆ తర్వాత వచ్చిన పితృస్వామిక సమాజం పురుషాధిక్యతకు దారి తీయడంతో స్త్రీ మానవాళి మొదటి బానిస అయింది కూడా ఆయనే వివరించారు.

చివరకు వారు నాయక స్థానం పోయి సేవక స్థానానికి, భోగకాంక్షలు తీర్చే వేశ్యల జోగినుల స్థానానికి దిగజార్చబడ్డారు. పిల్లలను కనడంలో గొప్పతనం పోయి వంశం నిలబెట్టే యంత్రాలుగా మార్చి వేయబడ్డారు. నాగరికత పెరిగి విజ్ఞానశాస్త్రం అభివృద్ధి చెందిన తర్వాత వచ్చిన గర్భస్థ శిశుపరీక్షల వంటివి ఇప్పుడు ఆడపిల్లలు పుట్టకుండా చేసే బలిహోమాలుగా మారాయంటే అంతకన్నా విపరీతం ఏముంటుంది? అలాగే కృత్రిమ పద్ధతుల్లో సంతానోత్పత్తి అవకాశం వచ్చాక ఇప్పుడు అద్దె గర్భాల పేరిట మళ్లీ ఆ అభాగ్య మహిళలనే విచక్షణా రహితంగా వినియోగించుకునే వికృత ధోరణులు చలామణి అవుతున్నాయి. నాటి రాజాస్థానాల నుంచి నేటి రియాల్టీ షోల వరకూ కూడా మహిళలపై అశ్లీల వ్యాఖ్యలు అసభ్య చిత్రీకరణ యథేచ్ఛగా సాగిపోతున్నాయి. అందాల పోటీలు, అంగాంగ వర్ణనలు అడ్డూఆపులేకుండా సాగిపోతున్నాయి. ఇవన్నీ చేసే వారే మళ్లీ మహిళల వస్త్ర ధారణపైన మర్యాదలపైన సూక్తులు చెబుతుంటారు. ఉన్నత స్థానాల్లో వారు ఆఖరుకు న్యాయమూర్తులు కూడా స్త్రీలు అణగిమణిగి వుండాలనీ, హద్దులు మీరడం వల్లనే అభద్రత ఏర్పడిందని బాధితులనే కారకులుగా చెబు తుంటారు. ఇదంతా ఒక తలకిందులు న్యాయం.

**ఆంధ్రప్రదేశ్‌లో ఒకప్పుడు సారా వ్యతిరేక ఉద్యమం జరిగినప్పుడు అందరూ సారాసుర సంహారం అన్నారు. విప్లవోద్యమాలూ రాజకీయ పరిపాలనా వ్యవహారాలు అన్నింటా తన పాత్ర నిర్వహించిన స్త్రీని గౌరవించడమనే సంప్రదాయాన్ని ఈ సమాజానికి అలవాటు కావలసిందే. సంస్కర్తలందరూ స్త్రీ కోసం కృషి చేసిన వారే. కనుక తరచూ చెప్పుకునేట్టుగా మాన ప్రాణాల రక్షణకే గాక సమానత్వ సాధనకు సమగ్ర వ్యక్తిత్వంతో పురోగమించడానికి ప్రతి మహిళ ఒక మహాకాళి ప్రతిరూపంగా మారవలసిందే. ఎందుకంటే అమ్మ పండుగ కేవలం నమ్మకం కాదు. మానవాళి మనగడకు కొండగుర్తు.**

ఒక వైపున మన యువతులు అంతర్జాతీయంగా దేశానికి గర్వ కారణమైన విజయాలు సాధిస్తున్నారు. మొన్న ఒలింపిక్స్ లోనూ పివిసింధు.... వంటివారు సాధించిన పతకాలు అందరినీ ఉత్తేజ పర్చాయి. పరీక్షల ఫలితాలు ఎప్పుడు వచ్చినా అమ్మాయిల పైచేయి అని లేదంటే పోటాపోటీ అని కథనాలు చూస్తుంటాం. కార్పొరేట్ రంగంలోనూ వ్యాపార వ్యవసాయ విద్యా కళా రంగాలన్నిటిలోనూ మహిళలు సత్తాచాటుతున్నారు.

సవాళ్లను సంఘర్షణలనూ అధిగమించి దూసుకు పోతున్నారు. అయినా కరుడుగట్టిన చాందస భావజాలం మారకపోవడం వల్లనే వారిని తక్కువగా చూడటంతో పాటు రకరకాలుగా వేధించి హింసానందం పొందుతున్నారు. బిజెపి అధికారంలోకి వచ్చాక హిందుత్వ ఛాందసంతో కేంద్ర మంత్రులూ, ముఖ్యమంత్రులే స్త్రీ వ్యతిరేక వ్యాఖ్యలు చేస్తున్నారు. ఆంధ్ర ప్రదేశ్ ముఖ్యమంత్రి కూడా ఒకటికి రెండుసార్లు ఈ తరహాలో మాట్లాడి విమర్శకు గురైనారు. వ్యభిచారానికి అధికారిక అనుమతి గురించి కూడా మాట్లాడిన ఉదంతాలున్నాయి. ఇప్పుడు కూడా సెక్స్‌టూరిజం వంటి మాటలు వినిపిస్తుంటాయి. ఇవన్నీ స్త్రీలను అవమానించే వ్యవహారాలే.

ఇలా మొత్తంపైన మతతత్వం మార్కెట్‌తత్వం కూడా స్త్రీల విముక్తికి విఘాతాలుగా మారి వారి శక్తియుక్తులను మనోస్థయిర్యాన్ని దెబ్బతీస్తున్నాయి. అభద్రతలో ముంచెత్తి అన్యాయాలను సహించే దుస్థితికి నెడుతున్నాయి. విద్యా విజ్ఞానాలతో ప్రతిభా చైతన్యాలతో దూసుకుపోగల మన మహిళల పురోగమనానికి, మనుగడకు కూడా ముప్పుగా మారుతున్నాయి. ఈ పరిస్థితికి పరిష్కారం ఆదిశక్తి కథలోనే దొరుకుతుంది.

ఆంధ్ర ప్రదేశ్‌లో ఒకప్పుడు సారా వ్యతిరేక ఉద్యమం జరిగినప్పుడు అందరూ సారాసుర సంహారం అన్నారు. విప్లవోద్యమాలూ రాజకీయ పరిపాలనా వ్యవహారాలు అన్నింటా తన పాత్ర నిర్వహించిన స్త్రీని గౌరవించడమనే సంప్రదాయాన్ని ఈ సమాజానికి అలవాటు చేయవసిందే. సంస్కర్తలందరూ స్త్రీ కోసం కృషి చేసిన వారే. కనుక తరచూ చెప్పుకునేట్టుగా మాన ప్రాణాల రక్షణకే గాక సమానత్వ సాధనకు సమగ్ర వ్యక్తిత్వంతో పురోగమించడానికి ప్రతి మహిళ ఒక మహాకాళి ప్రతిరూపంగా మారవలసిందే. ఎందుకంటే అమ్మ పండుగ కేవలం నమ్మకం కాదు, మానవాళి మనగడకు కొండగుర్తు.

వ్యాసం

# శ్రమ దోపిడీపై సమరభేరి-పోరాటపథాన 'ఓలం' మహిళా కార్మికులు

-ఎల్.గౌరి

ఓలం జీడిపిక్కల కంపెనీలో శ్రమ దోపిడీపై మహిళా కార్మికులు తిరుగు (బాటు) బావుటా ఎగుర వేశారు. ఎన్నాళ్ళని, ఎన్నే ళ్ళని తక్కువ కూలికి రెక్కలు ముక్కలు చేసుకుంటాం? మేమూ పిల్లా పాపలతో బతకాలి.. కనీస వేతనాలు ఇవ్వాలి...' అంటూ పోరాడుతున్నారు. వారి సమ్మె మొదలై 50 రోజులు దాటుతోంది. ఈ 50 రోజులుగా వారి ఆందోళన అంత సులువుగా ఏమీ సాగిపోవడం లేదు. యాజమాన్యం వేధింపులతో పాటు ఇళ్ళల్లో సాధింపులు కూడా ఈ ఆడాళ్ళ సాగిస్తున్న పోరుబాటకు ఆటంకాలే! అయినా సాధింపులను, వేధింపులను, ఆకలి దప్పులను భరించి పోరుబాటన నడుస్తున్నారు. ఇంటా బయటా సమస్యలు ఉన్నా, తగిన సహ కారం అందకున్నా, ఆర్థిక పరిస్థితి సహకరిం చకపోయినా, అప్పులోళ్ళు వెంటపడుతున్నా, అవసరాలు తరుముకొస్తున్నా పట్టువీడక సమ్మె చేస్తున్నారు.

వీరిని ఇంతగా నిలబడేలా, తెగబడి పోరాడేలా చేసిందెవరు; ఓలం యాజ మాన్యం కాదా? అన్నీ సవ్యంగా ఉంటే ఫ్యాక్టరీ పనిలోకి వెళ్ళడానికి వారికేమైనా ఇబ్బందా?




**కనీస కూలి కోసం:** ఓలం జీడిపిక్కల ఫ్యాక్టరీలో కార్మికుల పనివేళలూ, యాజ మాన్య పద్ధతులూ బాగోలేవు. పనిభారం గతంకన్నా పెరిగింది. వేతనం గతం కన్నా తగ్గించేశారు. ఏ చట్టాలూ పాటించడం లేదు. కార్మికులను బానిసలా చూస్తున్నారు. అన్నింటికీ మించి- గతంలో ఇచ్చే వేతనాన్ని కూడా ఇప్పుడు ఇవ్వడం లేదు. నెలనెలా ఇచ్చే ప్రోత్సాహక నగదు కూడా రద్దు చేస్తామంటున్నారు. నచ్చితే పనిచేయండి.. లేకుంటే పొండి.. అన్న పద్ధతిలో యాజ మాన్యం మొండివైఖరి అవలంబిస్తోంది.

ఇలాంటి స్థితిలో మహిళలు పోరాటా నికి దిగారు. వారు చేస్తున్నది మామూలు పోరాటం కాదు; ఆకలి పోరాటం. ఇది అదనపు సదుపాయాల కోసం కాదు; న్యాయబద్ధమైన వేతనం కోసం, పనిచేసే చోట ఆత్మగౌరవం కోసం...

**ఫ్యాక్టరీ పని పద్ధతులు:** గ్రామీణ మహిళ శ్రమ ఇక్కడ కారుచౌక వస్తువైంది. విశాఖ జిల్లా నర్సీపట్నం డివిజన్లో సుమారు 8000 మంది మహిళా కార్మికులు జీడిపిక్కల కంపెనీల్లో అతి తక్కువ పారితోషికానికి పనిచేస్తున్నారు. వీరు షుమారు ఫ్యాక్టరీకి 18 కిలోమీటర్ల దూరం నుంచి రోజు వచ్చి పనిచేస్తారు. నర్సీపట్నం డివిజన్‌లోని నాతవరం, జోగంపేట, రోలుగుంట, జానకి రాంపురం, అమలాపురం తదితర గ్రామాల్లో ఓలం వంటి జీడిపిక్కల కంపెనీలు విస్తరించి ఉన్నాయి. ఈ ఫ్యాక్టరీల్లో చట్టాలు చట్టుబండలే. ఎన్నేళ్ళు పనిచేసినా ఒక్కరికి కూడా కంపెనీ ఇంతవరకూ పిఎఫ్ చెల్లించకపోవడం గమనార్హం. జీతం ఇచ్చేటప్పుడు టంచనుగా పిఎఫ్ కటింగ్ అంటూ కట్ చేస్తున్న యాజమాన్యం వాటిని పిఎఫ్ రూపంలో కార్మికులకు పంపిణీ చేయకుండా దోపిడీకి పాల్పడుతోంది.

**కటింగ్ సెక్షన్:** ఫ్యాక్టరీ నడవాలంటే కటింగ్ సెక్షన్ కీలకం. వారు పిక్కలను కట్ చేసి ఇస్తే గ్రేడింగ్ తదితర పనులు ముందుకు సాగుతాయి. ఈ కటింగ్ సెక్షన్ కార్మికులు అత్యంత దుర్భర స్థితిలో పనిచేస్తున్నారు. పని వేళలు మహా దారుణం. **'యంత్రాలు ఒలవలేని బండ, మొండి పిక్కలను మాకిస్తారు. గతంలో యంత్రం రాక ముందు అన్ని రకాల పిక్కలను వొలి చేవారు.**

**ఇప్పుడు మొండి పిక్కలను మాత్రమే వొలుస్తున్నాము. యంత్రం లేకముందు పేజీకి 15రూ॥లు ఇచ్చేవారు. యంత్రం వచ్చాక పది రూపాయలు తగ్గించి కేవలం 5 రూపాయలే ఇస్తున్నారు.**

**ఉదయం 6 గంటల నుండి సాయంత్రం 8 గంటల వరకు**: కటింగ్ సెక్షన్ పని తొందరగా మొదలవుతుంది. ఉదయం 6 గంటలకే ఫ్యాక్టరీలో ఉండాలి. రాత్రి 7 గంటల వరకు పనిచేయాలి. ఇళ్ళకు చేరేసరికి 8 గంటలు దాటిపోతుంది. తేరిపార పిల్లలను చూసుకోవడానికే కుదరదని, పిల్లల యూనీఫారాలు ఉతకడం రాత్రి 11 గంటలకే. పొద్దునకు బట్టలు ఆరకపోయినా పిల్లలు చల్లని బట్టలు వేసుకుంటారని నర్సీపట్నంకు చెందిన శిస్టా పార్వతి ఆవేదన వ్యక్తం చేసింది.

**ఫాక్టరీ లోపలికి వెళ్ళే టైమే లెక్క:** కార్మికులు ఎన్నిగంటలకు వచ్చారనేది లెక్కే కాని ఎన్నింటికి బయటకు వెళ్తారన్నది లెక్క కాదు. కటింగ్ సెక్షన్ వాళ్ళు 12 నుండి 13 గంటలు ఏకధాటిగా పనిచేస్తే వారికి రోజుకి 150 నుండి 200 దాటదు. కేరళలో కనీసవేతనం 400 చెల్లిస్తుండగా ఇక్కడ రెండొందలు దాటలేదు. ఫ్యాక్టరీకి వెళ్ళడం కోసమే తిండి అందుకోసమే నిద్ర అన్నట్లు కటింగ్ సెక్షన్ కార్మికులు యంత్రాలుగా మారుతున్నారు. ఫ్యాక్టరీ పని ముగిసే సమయాన్ని నిర్ధష్టంగా నిర్ణయించాలన్నది, ఇష్టానుసారం 8 గంటల వరకు పనిచేయించడం తగదన్నది కటింగ్ సెక్షన్ పనివారి ప్రధాన విన్నపం.

**గ్రేడింగ్ ఇతర సెక్షన్లు** : కటింగ్ అనంతరం పిక్కల గ్రేడింగ్‌లో 14 రకాలుగా పని ఉంటుంది కేజీపప్పు 500 రూ॥లకు అమ్ము తున్న యాజమాన్యం అదే కేజీ పప్పు గ్రేడింగ్ దగ్గర 3 రూ॥ల నుంచి 5 రూ॥లకు మించి చెల్లించడం లేదు. ఒక్క జీడిపిక్కను రకాన్ని బట్టి రూ. 2 నుండి రూ. 5 వంకు అమ్ముతున్న జీడిపిక్క కంపెనీలు కార్మికులకు పేజీ పిక్కలు (70 నుంచి 80 పిక్కలు) ఒలిస్తే రూ. 5 ఇస్తున్నారు.

**దోపిడీకి దారులు ఏటిఎమ్ కార్డులు** : గతంలో జీడిపిక్క కార్మికులకు చేతి పేమెంటులు ఇచ్చేవారు. కానీ ఇప్పుడు వేతనాలు బ్యాంకులో వేస్తున్నారు. గతంలో వారం రోజులకి పేమెంట్స్ ఇస్తే తాను చేసిన ప్రకారం లెక్కలు వేసుకొని తగ్గిన వేతనంపై కార్మికులు ప్రశ్నించి తగ్గిన వేతనాన్ని తీసుకునేవారు. కానీ ఇప్పుడు బ్యాంకులో వారు ఎంత వేస్తున్నారో తెలుసుకోలేక పోతున్నామని చదువులేక ఆ అంకెలు అర్థం కావట్లేదని యంత్రం లోంచి డబ్బులు తేడా వస్తే ఎవరిని అడగాలో తెలియడంలేదు. 15 రోజులకొకసారి పేమెంట్స్ రావడంతో భారీగానే వేతనాన్ని యాజమాన్యం నొక్కేస్తున్నారని ఆవేదన వ్యక్తం చేస్తున్నారు.

**కార్మికులు ఎన్నిగంటలకు వచ్చారనేది లెక్కే కాని ఎన్నింటికి బయటకు వెళ్తారన్నది లెక్క కాదు. కటింగ్ సెక్షన్ వాళ్ళు 12 నుండి 13 గంటలు ఏకధాటిగా పనిచేస్తే వారికి రోజుకి 150 నుండి 200 దాటదు. కేరళలో కనీసవేతనం 400 చెల్లిస్తుండగా ఇక్కడ రెండొందలు దాటలేదు. ఫ్యాక్టరీకి వెళ్ళడం కోసమే తిండి అందుకోసమే నిద్ర అన్నట్లు కటింగ్ సెక్షన్ కార్మికులు యంత్రాలుగా మారుతున్నారు.**

**అనారోగ్య సమస్యలు : ఓలం జీడిముక్కల ఫ్యాక్టరీ 6 యూనిట్స్‌గా ఉన్నాయి.** మండలాలకి దూరంగా పచ్చని పంట పొలాల మధ్యలో ఈ ఫ్యాక్టరీలు ఉన్నాయి. భూమి లేని పేదలు, ఒంటరి మహిళలు అధిక సంఖ్యలో ఈ కంపెనీలో పనిచేస్తున్నారు. చీఫ్ లేబర్‌గా యజమానులకు దొరుకుతున్నారు. ఇక్కడ నిరక్షరాస్యులు, భర్తలున్నా అతను తెచ్చిన డబ్బులు తాగుడుకు ఖర్చు చేయడం వలన కుటుంబాన్ని నడపాల్సిన బాధ్యత స్త్రీలపై పడింది. 10 సం॥ల నుండి మహిళలు పనిచేస్తున్నారు. వీరికి అనారోగ్య సమస్యలు తీవ్రంగా ఉంటాయి. లాభం మాత్రం యజమానికి. జీడిపిక్కలు కట్‌చేసినప్పుడు శరీరం మొత్తం కదులుతుంది. దీనివలన గర్భసంచి తీసివేయడం, కడుపునొప్పి, నడుంనొప్పుల తీవ్రతతో ఇబ్బంది పడుతున్నారు. వీరి చేతులు జీడిపడి నల్లగా మచ్చలు ఏర్పడి చర్మం మీద పుండ్లు పరిస్థితి నెలకొన్నా గ్లౌజులు కానీ, ఆయిల్ కానీ ఇవ్వరు.

కేరళలో జీడిపిక్కల పరిశ్రమలో పనిచేస్తున్న కార్యికులకు కనీస వేతనాలతో పాటు ప్రశూతి సెలవులు, పిఎఫ్, గ్రాట్యుటీ వంటివి అమలు చేస్తున్నారు. కానీ ఆంధ్రప్రదేశ్‌లో వున్న ప్రభుత్వం కార్మిక చట్టాలను ఉల్లంఘించి కార్మికుల నడ్డి

విరుగగొడుతున్నారు. ఇక్కడ ప్రభుత్వం, అధికారులు ప్రేక్షక పాత్ర వహిస్తున్నారు.

**ఏం సాధించారు?:** సమస్యలపై పోరాటానికి దిగిన కార్మికులకు ఇంటా బయటా సమస్యలు ఎదురవుతున్నాయి. ఓ కార్మికురాలు నర్సీపట్నం ఆర్డీవో కార్యాలయం వద్ద ధర్నా చేసి ఇంటికి వెళ్లింది. ఆమె వాకిట్లోకి వెళ్ళీ వెళ్ళగానే- 'ఏం సాధించేరే? చేసింది చాలు గానీ- నోర్మూసు కొని పనికి పొండి - ఆడెంతిత్తే అంత తీస్కొని తిన్నగా ఇంటికిరా. ధర్నాలు, గిర్నాలూ అన్నావా ఈపు విమానం మోత మోగు తాది...' అని ఆమె భర్త నుంచి ఆహ్వానం ఎదురైంది. ఆమె పోరాడేది, ఒళ్ళు వంచి పనిచేసేదీ అన్నీ ఇంటి కోసమే... అయినా ఇలాంటి సాధింపులు! పనిచేసే ఆమెకు తెలుసు శ్రమ విలువ. అందుకే ఆడాళ్ళంతా ఎన్ని ఇబ్బందులైనా భరించి పోరుబాటన పయనిస్తున్నారు. ఈ ధర్నాలు గోల- ఫైనాన్సోడు డబ్బుల కోసం సతాయిత్తన్నాడు. నువ్వు పనికైనా పో లేదా నీ పుట్టింటికిపో' అని భర్త అరుస్తున్నాడు.

**గడ్డి కోసుకొస్తానని చెప్పి, ధర్నాకు :** ఓ మహిళ ఈ బాధలన్నీ పడలేక గడ్డి కోసుకొస్తానని ఇంట్లో చెప్పి.. జానకి రాంపురం ఫ్యాక్టరీ గేటు ఎదుట ధర్నాకు వచ్చింది. ధర్నా అనంతరం వెళ్ళి గడ్డికోసు కొని ఇంటికి వెళ్ళింది. ఆదేమని అడిగితే 'ఇంట్లో మగాళ్ళకు ఎంతో కొంత డబ్బు ఇస్తే చాలు.. మేం ఎంత కష్టపడ్డా. అక్కడెం తిచ్చాడు అన్నది అనవసరం. అందుకే పోరాటాలు వద్దని, ఫ్యాక్టరీకి వెళ్ళిపొమ్మని తిడుతున్నారు. అయినా మేం వెనక్కు తగ్గేదేమీ లేదు. న్యాయంగా మాఆకు కూలి పెంచాలి, అంతే..' అని చెప్పింది. అయితే, మగాళ్ళందరూ ఇలా లేరు. ఫ్యాక్టరీ అన్యాయంపై పోరాడాలని ప్రోత్సహిస్తున్న వారూ చాలామందే ఉన్నారు.

**నిరుత్సాహపరచిన అయ్యన్న :** ఓలం యాజమాన్యం మొండికేస్తుంటే కార్మికులంతా పంచాయితీ రాజ్ శాఖా మంత్రి అయ్యన్న పాత్రుడి ఇంటికి వెళ్ళి మొరపెట్టుకున్నారు. ఆయన ఓలం యాజమాన్యంతో మాట్లాడి తమకు న్యాయం చేస్తాడని వారి నమ్మకం. కానీ అయ్యన్న ఇందుకు భిన్నంగా స్పందించారు. 'పోరాటం చేస్తే ఓలం వాడు ఫ్యాక్టరీ మూసుకొని పోతాడు. ఎందుకొచ్చిన గొడవ? వాడెంతిస్తే అంత పుచ్చుకుని పనిచేసుకోండి, తెగేదాకా లాక్కండి' అనేశారు. అయ్యన్న ఇలా మాట్లాడడం కార్యికులను తీవ్ర ఆవేదనకు, ఆగ్రహానికీ గురిచేశాయి. 'ఓట్లకోసం మా ఇళ్ళకొస్తారు గానీ మేము న్యాయమడిగితే చేయవా' అంటూ మహిళలు అక్కడే శాపనార్థాలు పెట్టారు.

**చోడవరం ఎమ్మెల్యే చొరవ :** రోలుగుంట మండల కార్మికులు ఈ సమస్యను చోడవరం ఎమ్మెల్యే దృష్టికి తీసుకెళ్ళారు. ఆ ఎమ్మెల్యే రాజు బాగా స్పందించారు. 'ఓలం లాంటి వాళ్ళకు మన గ్రామాల్లో ఫ్యాక్టరీ పెట్టుకోవడానికి మన రైతులు భూములు ఇచ్చారు. తమ పొలాల్లోంచి రోడ్డు వేసుకోవడానికి ఒకరిద్దరు రైతులు ఒప్పుకోకుంటే పెద్దలు మాట్లాడి ఒప్పించి మరీ ఫ్యాక్టరీ పెట్టించారు. మనం కరెంటిచ్చాం, నీళ్ళిచ్చాం, భూమిచ్చాం. మన గ్రామీణానికి ఇంత పని చూపిస్తాడే కదా ఇదంతా చేసింది. అలా చేయనప్పుడు నిలదీయడం, పోరాడటం న్యాయమే! మీ తరపున ఓలం యాజమాన్యంతో మాట్లాడ తాను' అని ఆయన హామీ ఇచ్చారు.

**డిమాండ్లు ఇవీ....**

**ఓలం యాజమాన్యం చట్టాలను అమలు చేయాలి.**

కేజీ జీడిపిక్కల ఒలుపునకు జిఒ ప్రకారం రూ. 10 లు ఇవ్వాలి. ప్రస్తుతం ఇస్తున్నదది రూ. 5. దీన్ని రూ. 9 కి పెంచాలని కార్మికులు కోరుతున్నారు. కేరళలో కేజీ పిక్కల కటింగ్‌కు రూ. 36 ఇస్తున్నారు. జిఒ ప్రకారం రోజు వేతనం రూ. 300 చెల్లించాల్సి ఉండగా, ఓలం యాజమాన్యం రూ. 150 నుంచి రూ. 200 చెల్లిస్తోంది. అదీ సీనియారిటీని బట్టీ. ప్రతినెలా ఇచ్చే ప్రోత్సాహక రుసుం రూ. 500 ఇకపై తొలగిస్తామని యాజమాన్యం అంటోంది. ప్రోత్సాహక రుసుమును యథాతథంగా కొనసాగించాలని ఐద్వా డిమాండ్ చేస్తోంది. గ్యాట్యుటీ, వేతనంతో కూడిన వారాంతపు సెలవులు, ప్రసూతి సెలవులు, పెన్షన్, ప్రమాద భీమా సౌకర్యాలను కల్పించాలన్నది కార్యికుల ప్రధాన డిమాండ్లు.

**వెన్నంటి ఉన్న సిఐటియు, ఐద్వా :** 50 రోజులుగా సమ్మెలో వున్న కార్మికులకు సిఐటియు ఐద్వా అండగా నిలబడ్డాయి. నేతలు అరెస్టలకు సైతం వెరవకుండా కార్మికుల తరపున నిలబడ్డారు. అంతేకాక సమ్మెకాలంలో కార్యికులకు బియ్యం ఇతర దినుసులను పంపిణీ చేశారు.

# ఉనా ఊరుకుంటుందా !

**- వేములపల్లి సత్యవతి**



ఆర్య, బ్రాహ్మణీయం, చాతుర్వర్ణ వ్యవస్థతో పాటు కర్మ సిద్ధాంతాన్ని కూడా ప్రవేశపెట్టింది. కర్మ సిద్ధాంతం చాతుర్వర్ణ వ్యవస్థను కాపాడటానికి రక్షణ కవచంలా ఉపయోగపడింది. కర్మ సిద్ధాంతం ప్రకారం "మనిషి తాను జీవించి ఉన్న కాలంలో చేసిన పనుల ఫలితాలను ముందు జన్మలో అనుభవిస్తాడు." జీవించి ఉన్నకాలంలో సత్కార్యాలు చేసినవారు ముందు జన్మలో సిరి, సంపదలతో, భోగభాగ్యాలతో, సుఖ-సంతోషాలతో జీవిస్తారు. చెడుపనులు చేసినవారు పేదరికంతో, దారిద్ర్యంలో, ఆకలి బాధలతో రోగాలతో జీవితాన్ని గడుపుతారు. ఈ సిద్దాంతం ప్రకారము ఏర్పడినదే పంచమ కులం. అంటరాని వారు, అస్పృశ్యులు. అనగా మాల, మాదిగ, డొక్కలోళ్ళు. వారిలో చాలా ఉపకులాలు ఉన్నాయి.

ట్రాక్టర్లు రాక పూర్వం వ్యవసాయానికి పశువులే ముఖ్య ఆధారం. రైతులు తమకున్న భూవసతిని బట్టి, వారి వారి స్తోమతను బట్టి పశు సంపదను వృద్ధి చేసుకునేవారు. నాగళ్ళతో వ్యవసాయం చేయడానికి ఎద్దులు, దున్నపోతుల అవసరం ఉండేది. వాటికొరకు ఆవులను, గేదెలను (బర్రె) పోషించేవారు. ఆవులు, గేదెలు పాడికి కూడా ఉపయోగపడేవి. ముసలవి అయిన తర్వాతనో లేక రోగాలతో మిగతా పశువులతో పాటు ఆవులు కూడ చనిపోయేవి. చనిపోయిన వాటిని రైతులు మాదిగలకు (చర్మకారులకు) ఇచ్చేవారు. మాదిగలు వాటి తోలు ఒలిచిన తర్వాత దాని మాంసాన్ని వండుకుని తినేవారు. ఇది అనాది కాలం నుంచి వస్తున్న పద్ధతి. ఒలిచిన చర్మాన్ని శుద్ధిచేసి చర్మకారులు రైతులకు, ఇతరులకు కావలసిన చెప్పులు కుట్టేవారు. ఎద్దుల మెడలలో అలంకరణకు చర్మంతో పట్టీల వంటివి తయారు చేసేవారు. ఆ పట్టీలకు రైతులు ఇత్తడితో చేసిన చిన్న చిన్న గంటలను కుట్టుకు నేవారు. వివాహాది శుభకార్యాలకు బండ్లలోనే ప్రయాణం చేసేవారు.

ఆ సందర్భంలో ఎద్దుల మెడలోని గంటల నుంచి లయ బద్ధంగా వెలువడే చప్పుడు చెవులకింపుగా వుండేది. మామూలు చెప్పులే కాక చర్మకారులు కిర్రు చెప్పులు కూడా చేసేవారు. అది ఖర్చుతో కూడిన పని అయినందున మోతుబరి రైతులు మాత్రమే వాటిని కుట్టించుకునేవారు. నడిచేటప్పుడు కిర్రు కిర్రు మని శబ్దం వచ్చేలాగ చేసినవి పొట్టకోసినా అక్షరం ముక్క రాని, అంటరాని వారైన చర్మకారులే. ఉన్నట్టుండి 2016వ సంవత్సరంలో గోమాంసం తిన్నవారిపై దాడులు మొదలయినవి. మైనారిటీ వర్గానికి చెందిన ఒక వృద్ధుడిని గోమాంసం తిన్నావని ఇంటిలోనుంచి బయటకు ఈడ్చుకొచ్చి చావబాదారు. 2016 జులై నెలలో ఇరువురు ముస్లిం మహిళలపై దాడిచేశారు. పరాయి మహిళను మాతగా భావించాలని చెప్పే భారతీయ సంస్కృతిని విడనాడి మహిళలని కూడా చూడకుండా చేసిన దాడి మధ్యప్రదేశ్‌లో తీవ్ర సంచలనం సృష్టించింది. ప్రజాందోళన తీవ్రత వలన పోలీసులకు ఆ మహిళల దగ్గర ఉన్న మాంసాన్ని పరీక్ష కొరకు ల్యాబ్‌కు పంపక తప్పలేదు. చివరికది గోమాంసం కాదని గేదె (బర్రె) మాంసమని తేలింది. గుజరాత్‌లోని ఊనా గ్రామంలో నలుగురు దళిత యువకులను గోసంరక్షణ కార్యకర్తలు చేతులు వెనుకకు విరచి జీపుకు కట్టేసి ఒకరి తర్వాత ఒకరు వంతుల వారిగా బహిరంగంగా చావబాదారు. ప్రజలంతా ఆ భయానక దృశ్యాన్ని కళ్ళారా చూసారు. చనిపోయిన ఆవు చర్మాన్నే వలుస్తున్నామని, తాము ఆవును చంపలేదని ఆ యువకులు మొత్తుకుంటున్నా వినిపించుకోలేదు.

బేడియా గ్రామస్తులు పదకొండు మంది ఊనా గ్రామానికి వచ్చారు. తమ దగ్గర ఉన్న జంట ఆవులలో ఒకటి చనిపోయిందని దానిని ఎత్తివేయటానికి చర్మకారులు కావాలని అడిగారు. పొలంలో పని చేసుకుంటున్న అయిదుగురు దళితులను ఒప్పించి తమ వెంట వాళ్ళ గ్రామానికి తీసుకెళ్ళారు. ఆ దళితులు చనిపోయిన ఆవును బండిలో వేసుకుని ఊనా గ్రామానికి తీసుకొచ్చారు. కత్తులతో చర్మాన్ని ఒలిచే పని మొదలుపెట్టారు. ఇంతలో వారిముందు

ఎద్దుల మెడలోని గంటల నుంచి లయబద్ధంగా వెలువడే చప్పుడు చెవులకింపుగా వుండేది. మామూలు చెప్పులే కాక చర్మకారులు కిర్రు చెప్పులు కూడా చేసేవారు. అది ఖర్చుతో కూడిన పని అయినందున మోతుబరి రైతులు మాత్రమే వాటిని కుట్టించుకునేవారు. నడిచేటప్పుడు కిర్రు కిర్రు మని శబ్దం వచ్చేలాగ చేసినవి పొట్టకోసినా అక్షరం ముక్క రాని, అంటరాని వారైన చర్మకారులే. హిందువయిన ప్రతివాడు ఆర్ఎస్ఎస్, శివసేన, గోసంరక్షకులు కానట్లుగానే ముస్లింలంతా మిలిటెంట్లు, తాలిబాన్లు కారు. వారిలో పరమత సహనం, పరమత గౌరవం, ప్రజాస్వామ్యం కావాలనేవారు ఎందరో ఉన్నారు.

ఒక తెల్లని కారు వచ్చి ఆగింది. దానిలో నుంచి అయిదారుగురు బయటకు వచ్చి ఆవును ఎందుకు చంపుతున్నారంటూ ఇనుప రాడ్లతో వారిపై దాడిచేశారు. ఆ దళితులకు సమాధానం చెప్పే అవకాశం కూడా ఇవ్వకుండా ఏకంగా దాడికి పాల్పడ్డారు. బట్టలు విప్పేసి ఊన్నా వీధులలో నగ్నంగా తిప్పారు. గొలుసులతో బండికి కట్టి ఈడ్చారు. తాము శివసేనకు చెందిన కార్యకర్తలమని చెప్పుకున్నారు. ఆవులను చంపినవారికి ఇదే గతి పడుతుందని హెచ్చరించారు. గోసంరక్షణ కార్యకర్తలైనా, శివసేన వారైనా అందరూ ఒక్క తానులోని ముక్కలే. ఇంత భూత దయగల వారికి సమాజంలో విచ్చలవిడిగా జరుగుతున్న అత్యాచారాలపై ఎందుకు చలనం కలగ లేదు? ముక్కుపచ్చలారని మూడేళ్ళ పసికూన నుంచి కాటికి కాళ్ళు చాచుకున్న ముసలులపై జరిగే అత్యాచారాలు వారిలో ఎందుకు స్పందన కలిగించడం లేదు? ఊనాలో జరిగిన అమానవీయ ఘటనా జ్వాలలు అలహాబాద్ లోని దళితులను కదలించింది. ర్యాలీగా కాలి నడకన బయలుదేరి ఆగస్టు 15 స్వాతంత్ర్య దినోత్సవం రోజుకు ఊనా చేరుకుంది. విశేషమే మిటంటే ఆ ర్యాలీలో ముస్లింలు కూడ పాలు పంచుకున్నారు. త్రివర్ణ పతాకాన్ని ఎగుర వేశారు. ఆ సభలో దళితులు చనిపోయిన గోవులను ఎత్తి వేయమని ప్రతిజ్ఞ పూనారు. చనిపోయిన ఆ కళేబరాలను ఎత్తివేయకపోతే కుళ్ళి కంపు కొడుతుంది, దుర్గంధం వ్యాపిస్తుంది. ఇక ఆ పని గోసంరక్షకులు, శివసేనవారు చేస్తారేమో చూడాలి. ఈ జాఢ్యం ఆంధ్రప్రదేశ్ లోనికి ప్రవేశించింది. తూర్పు గోదావరి జిల్లా అమలాపురంలో ఆవు చర్మం ఒలిచారంటూ దళితులపై దాడి చేశారు గోసంరక్షకులు. అమలాపురంలో ఒక రైతువి మూడు ఆవులు తప్పి పోయినవి. రైతుల వద్ద పశువులు తప్పిపోవడం, వాటిని వెతికి తెచ్చుకోవటం జరుగుతూనే ఉండేది. రెండు ఆవులు దొరికినవి. మూడవది దొరకలేదు. కరెంట్ షాకుతో చనిపోయిన ఆవు చర్మాన్ని దళితులు వలుస్తున్నారు. అది తప్పిపోయిన ఆవు కాదని తేలింది. హైదరాబాద్‌లో దేశ ప్రధాని గో హత్య నేరంపై దాడి చేసేవారు ముందుగా నన్ను కాల్చండని బహిరంగ సభలో ప్రకటించిన మరునాడే దళితులపై అమలాపురంలో దాడి జరిగింది.

మైనార్టీల మీద, ఇతర మతస్థుల మీద, దళితుల మీద, హేతువాదుల మీద జరిగే హింస, దౌర్జన్యాలు, హత్యలను ప్రజాస్వామిక వాదులంతా ముక్త కంఠంతో ఖండించాలి. హిందువయిన ప్రతివాడు ఆర్ఎస్ఎస్, శివసేన, గోసంరక్షకులు కానట్లుగానే ముస్లింలంతా మిలిటెంట్లు, తాలిబాన్లు కారు. వారిలో పరమత సహనం, పరమత గౌరవం, ప్రజాస్వామ్యం కావాలనేవారు ఎందరో ఉన్నారు. ఈ మధ్య జరిగిన పార్లమెంట్ సమావేశాలలో అసరుద్దీన్ ఓవైసీ ఎంపి మెడమీద కత్తి పెట్టినా వందేమాతరం పలకనన్నాడు. అదే సభలో జావెద్ అఖ్తర్ ప్రసిద్ధి చెందిన కవి, ఎంపి, వంద సార్లు వందే మాతరం అంటానని ఏ ప్రాంతంలోనైనా ఇదేమాట పై నిలబడతానని, ప్రత్యర్థిగా అసరుద్దీన్ ఓవైసీ పోటీకి నిలబడాలని సవాల్ విసిరారు. అజ్మీర్ దర్గా ఆధ్యాత్మిక ముస్లిం గురువు జైనుల్ అబెదిన్ అలీఖాన్ గోమాంస భక్ష చిచ్చుపై చెలరేగిన అల్లర్లను ఖండించారు. పైగా గోసంరక్షణకు ముస్లింలు ముందుకు వచ్చి ఆదర్శవంతులుగా నిలబడాలన్నారు. గోవులు హిందువులకు ఎంతో పవి త్రమైనవి. గోమాంస విషయంలో హింసను ప్రేరేపిస్తున్న మతతత్వ శక్తులకు ఈ అంశం ఒక ఆయుధంగా మారింది. ఇరు పక్షాల వారు మతసహనానికి, సమైఖ్యతకు కృషి చేయాలని దీనివలన సమాజంలో శాంతి భద్రతలు నెలకొంటాయని ప్రకటించారు. అలీఖాన్ మహోన్నత వ్యక్తి అని, సమాజంలో శాంతి–భద్రతలు నెలకొని ప్రజలు స్వేచ్ఛగా ఊపిరి పీల్చుకోవాలని కోరే మహనీయుడని తేటతెల్లమవుతున్నది. మత దురహంకారులకు ఇప్పటికైనా జ్ఞానోదయం కలగాలని కోరుకుందాం.

# ఆపద్ధర్మం

- శమంతకమణి దుట్టా

ఎండ కణకణా మండుతుంది. రోహిణి కార్తె ఎండల తీక్షణత కన్నా సుగంధ మనస్సులో రగులుతున్న అగ్ని జ్వాలలే తీవ్రంగా ఉన్నాయి. కోర్టు గుమ్మం మీద ఉంది కేసు, శాలరీ ఎటాచ్‌మెంట్ కోసం ఏ క్షణంలోనైనా వెళ్ళిపోవచ్చు. అపార్ట్ మెంట్‌లో అగౌరవం, బయటే సెటిల్ చేసుకోమని అధికారుల సలహా. న్యాయపరంగా ఎదుర్కోవచ్చు. పరిస్థితిని చెప్పుకుని నెలనెలా కట్టవచ్చు. నెలనెలా పేస్లిప్ చూసుకుంటే కలిగే వేదన విలువ కనీసం నాలుగు లేదా ఐదు సంవత్సరాలు.

తాను తప్పు చేసిందా? మనిషిగా, మానవత్వంతో స్పందించడమే తాను చేసిన నేరమా? మూడక్షరాలు ముంచుతా యనుకుంటే "అంత్య నిష్ఠూరం కన్నా ఆది నిష్ఠూరం మేలనే" తన సిద్ధాంతానికే కట్టుబడే ఉండిపోయేది. తన జాతి విలువ దాదాపు రెండు సంవత్సరాల శ్రమకు సరిపడా జీతం. డబ్బుకింత అని వెల కట్టగలం. కానీ కోల్పోయిన, కోల్పోబోతున్న మానసిక క్షోభకు ఏ షరాబు ఖరీదు కట్టగలడు? కణతలు నొక్కుకుందామె! "వర్టిగో" ఉన్న సుగంధ ఆలోచనల సాంద్రత పెరిగితే ఆరోగ్యం తిరగబడుతుంది. తనకే మయినా అయితే పిల్లల పరిస్థితి ఏమిటి?

అంతంత మాత్రం ఆర్థిక స్థితి. అన్యుల సమస్యల పట్ల సానుభూతి ఏల? ఓదార్పు మాటలతో సరిపెట్టకుండా, ఓర్చుకో లేనంత శ్రమ అవసరమా తల్లీ! మానసిక శారీరకావస్థను గమనిస్తున్న మృదుల "టీ" తెచ్చింది. "తేనీరు చైతన్యపు హోరు" అంటూ ఏ భావావేశం కలిగినా ఓ కప్పు టీ త్రాగడం సుగంధ అలవాటు. తలనెప్పి కాస్త తగ్గినట్లనిపించింది.

"పేపర్, పెన్ను తీసుకురమ్మన్న" తల్లి సూచనతో, రెండూ తెచ్చి సుగంధ ప్రక్కనే కూర్చుంది. చెప్పిన లెక్కలన్నీ రాసి కూడింది. "టేబుల్ పై పెట్టి నువ్వెళ్ళి చదువుకో" అంటూ కూతురిని పురమాయించి, మొబైల్‌లో ఎవ్వరికో మెసేజ్ పెట్టింది. "రేపే వస్తాం" అన్న జవాబు చూసి ఆలోచనల్లో పడింది. "నిదురపడితే మనసు కాస్త కుదుటపడతది" అంటాడో సినీ కవి. "కుదురే లేని మనస్సును నిద్రాదేవి కౌగలించు కోలేదు" అన్నది సుగంధ స్వానుభవం. మంచం మీద నడు వాల్చిన సుగంధకు ప్రస్తుత తన కడగండ్లకు కారణమైన ఆ రోజు జ్ఞాపకం రాసాగింది.

తగ్గని రోగానికి స్థాయిని మించిన ఆస్పత్రి వద్దని నువ్వు ఆనాడే చెప్పావు. కానీ జన్మనిచ్చిన తండ్రిని అలా వదిలివేయలేక పోయాం. ఐదు లక్షలు అయ్యింది బిల్. మావద్ద మూడు లక్షలే ఉన్నాయి. దయచేసి ఈ ఒక్కసారికీ సహాయం చేయి" కళ్ళంట నీళ్ళూరుతుండగా అర్థింపుగా అడిగాడతను.

"నా దగ్గర బ్యాంక్ బ్యాలెన్స్ ఎప్పుడూ ఉండదు. వచ్చే జీతంలో సర్దుకోవడం తప్ప మిగిలేదేమీ ఉండదు".

"డబ్బుగా అక్కర్లేదక్కా! రైల్వే ఉద్యోగిగా నీ సంతకం చాలా విలువైంది" ఒక్క హామీ సంతకం చాలు. బిజినెస్ పై ఫైనాన్స్ ఇవ్వడానికి ఓ కంపెనీ సిద్ధంగా ఉంది. ఆ మొత్తం రావడానికో మూడు రోజులు చాలు. ఈ లోపు "కాల్ మనీ" ఇస్తానన్నాడో మిత్రుడు. అక్కా! ఒక్కసారి ఆలోచించు. ఈ ఒక్క సహాయం చేయి". వేడికోలు అత్యంత దీనంగా ఉంది.

"అక్కా! జీవితంలో ఎందరికో ఎన్నో సాయాలు చేశావు. దయచేసి ఈ పరిస్థితి నుండీ గట్టెక్కించు ఇంకెప్పుడూ నిన్నేమీ అడగం" చేతులు పట్టుకుని బ్రతిమాలు తున్నాడు వరుసకు "తమ్ముడు" అయ్యే ఆ వ్యక్తి. మరణించింది దూరపు బంధువే, కానీ తన బాల్యం కొంత ఆ వ్యక్తి చేతుల్లో నడిచింది. కార్పొరేట్ ఆస్పత్రి కారణంగా బిల్ కడితే తప్ప, శవం ఇవ్వమంటున్నారు. ఎదురుగా ఏడుస్తున్న పిన్ని, పక్కనే కోడళ్ళు, మనవలు. "ఫైల్ తెప్పించు" సుగుంధ నోటి నుండీ మాట వెలువడడమే ఆలస్యం, అక్కడే ఉన్న ఎగ్జిక్యూటివ్ ముందుకు వచ్చాడు. "ఆస్పత్రి మెట్లమీదే కూర్చుని సంతకం చేసింది. "నెల నెలా జాగ్రత్తగా కట్టండి" అంటూ పెన్ మూస్తున్న ఆమె జీవితంలో చాలా 'ఖరీదైన అనుభవం' తనకు రాబోతున్నదని ఊహించలేదు.

కాలగమనంలో మూడు సంవత్సరాలు సంబంధిత కంపెనీ నుండే ఫోన్ కాల్‌ల వరద 'డబ్బు కట్టండంటూ, తమ్ముడికి ఫోన్ చేస్తే మొదట కడతామన్న సమాధానం క్రమంగా ఫోన్ నెంబర్‌కి అందకుండా, తర్వాత మొత్తంగా బిచానా సంసారం మొత్తం ఎత్తేశారు. ఎక్కడున్నాడో తెలి యదు. బంధువులెవ్వరూ ఆచూకీ ఇవ్వలేక పోవడమే కాక "ఏ ఆధారముందని సాయం చేశావు? అంటూ తలో రకంగా వ్యాఖ్యానాలు.

.......

> తాత్కాలిక సమస్య వలన శాశ్వతమైన నీ వ్యక్తిత్వానికి లోపం రానివ్వకు. పేరుకి తగ్గట్లు నువ్వెక్కడున్నా సుగంధ పరిమళాలు వెదజల్లుతూ ఉండాలి.

ఫోన్ మ్రోగింది. అసలే విసుగ్గా ఉంది. అయినా సరే ఎవరా? అనుకుంటూ చూసినామెకు స్నేహితుని పిలుపు ఉద్యోగ రీత్యా ఒక్కసారే జాయిన్ అయ్యారు. పరాయి దేశంలో మరో ఉద్యోగం చూసుకుని రిజైన్ చేసి వెళ్ళిపోయిన బాలస్నేహితునితో ఓ అరగంట మాట్లాడటం అతని అలవాటు. చికాకులో ఓ రిలీఫ్ అనుకుంటూ మొబైల్‌లో కాల్ ఆన్ చెప్పిందామె. కుశల ప్రశ్నలు, కుటుంబ విశేషాలు తర్వాత నూతన రాజధానిలో తన పేరునున్న ఆస్థిని "ఎలాగూ అమ్మేసి ఈ సమస్య నుండిబయట పడాలని నిర్ణయించుకున్నాను. నువ్వేమన్నా తీసు కుంటావా అడిగింది సుగంధ. "తొందర పాటు నిర్ణయాలు తీసుకోకు, నేను మరలా ఫోన్ చేస్తాను. బై" అంటూ శెలవు తీసుకున్న మిత్రుడి అంతరంగం అర్ధం కాలేదు. ఏది ఏమైనా "రేపు" ఓ కీలకమైన రోజు. రూపాయి, రూపాయి కూడగట్టిన తన కష్టార్జితం కరిగి వెళ్ళిపోతున్న కాలం. నిద్రరాని నిశిరాత్రుల్లో మరో రాత్రి ఖాతాలో జమయ్యింది. "లంచ్ బ్రేక్ లో శివ వస్తాడు. చెక్ తీసుకో, వివరాలు మెయిల్ పెట్టాను చూసుకో" అంటూ ఫ్లాష్ అయిన మెసేజ్ చూసి కళ్ళు తడిబారాయి సుగంధకు.

స్థలం అమ్మవద్దని సూచనా? లేక తానే కొనుక్కుంటాడా? అందుకని అడ్వాన్స్ పంపాడా? ఏది ఏమైనా ఒ గొప్ప రిలీఫ్. వెంటనే "స్థలం తాను అమ్మబోవడం లేదని" బ్రోకర్‌కి ఫోన్ చేసింది సుగంధ.

"చేతిలో డబ్బుంటే కలిగే గుండె ధైర్యమేమిటో?' సుగంధకు జీవితంలో "తొలిసారి"గా అనుభవం లోకి వచ్చింది. మార్కెట్ రేటు పరిగణలోకి తీసుకోకుండా, మిత్రుడు ఎంతిస్తే అంతే తీసుకొని రిజిస్ట్రేషన్ చేసెయ్యాలని నిర్ణయిం చుకుంది. ప్రశాంతంగా ఉన్న తల్లి వదనం, రాగానే సిస్టమ్ ముందు కూర్చోవడం చూసిన మృదులకు విషయం అర్ధంగాక పోయినా, అమ్మకోసం "గ్రీన్ టీ" చేసి తీసుకొచ్చిం దామె. కప్పు అందుకున్న సుగంధ ఓ ప్రింటవుట్ కూతురు చేతిలో పెట్టింది. "సుగంధా!"

బాల్యం నుండే, ఉన్నంతలో పదిమందికీ సహాయం చేసే అలవాటు నీది. అలా సహాయం పొందిన అసంఖ్యాకుల్లో నేనూ ఒకడిని. నీ పాకెట్ మనీ లోనే ఎన్నోసార్లు పుస్తకాలకు, ఫీజులకు సమయాను కూలంగా సాయం చేసే దానివి. ఆనాడు చిన్న మొత్తం, ఈనాడు నీవు స

హాయం చేసింది పెద్దమొత్తం! అంతే తేడా! తప్పుచేశానా? అని తరచూ తర్కించుకోకు. మనశ్శాంతిని కోల్పోతావు.

నీ సంతకం విలువ రూపాయల్లో పరిగణించకు. అది నిన్ను నీవు అవ మానించుకోవడం. "మూడక్షరాల నీ సంతకం విలువ జీవిత కాలమంత," ప్రస్థుతం నీవున్న పరిస్థితి ఖచ్చితంగా ఇబ్బందికరం. అందువలన నీకున్న కొద్దిపాటి స్థలం అమ్మేసి, సమస్యల నుండి బయటపడటం తాత్కాలిక ప్రయోజనం తప్ప, శాశ్వతం కాదు. పై చదువులకు పిల్లలు వస్తున్న తరుణంలో, వాళ్ళకు అవసరమయిన సమయంలో అమ్ముకే! ప్రస్థుతం ఆ ఆలోచన మానివేసి నేను పంపిన చెక్‌తో సమస్యనుండీ బయటపడు.

నీకు వీలు కుదిరినప్పుడు ఏక మొత్తంగానో, వాయిదాల పద్ధతిలో, కోర్ట్‌లో కడుతున్నట్లు, నాక్కూడా కట్టు. ఎలా ఇచ్చినా, ఎంతకాలానికిచ్చినా అభ్యంతరం లేదు. నిజానికీ మొత్తం ఇచ్చేసి నీ రుణం తీర్చుకోవచ్చు. కానీ మేనకోడలు వివాహం కుదిరింది. నా బాధ్యతలు, నా ఆదాయ వ్యయాలు నీకూడా తెలుసు. "పెళ్లి పెట్టుకుని నాకెందుకే ఆ మూని సహాయం? "అంటావా? వెరీ సింపుల్ "ఆపద్ధర్మం"

ఆనాడు నువ్వు మా అందరికీ చేసినా, ఈనాడు నేను నీకోసం చేస్తున్న పరస్పర సహకారం. లేకుంటే నీకు మనుష్యులపై నమ్మకం పోయి, డబ్బు, ఆధిపత్యం వస్తుంది. కఠినపు అనుభవాలు మానవ త్వాన్ని మింగేసి స్వార్ధాన్ని కలిగిస్తాయి. నా స్నేహితురాలు సుగంధ, కఠినాత్ము రాలవ్వడం అసహజంగా, అమాన వీయంగా మారిపోవడం నాకిష్టం లేదు.

నా బంధువులొస్తారు. నువ్వు కట్టే సొమ్ము తిరిగి ఇస్తారు. నీ హామీ వృధా పోదు. ఎందుకింత నమ్మకం అంటావా? నేటి సమాచార వ్యవస్థ, సాంకేతిక పరిజ్ఞానంతో వాళ్ళు ఎక్కడున్నా గాలించ వచ్చు. అన్నింటికీ మించి రక్తసంబంధం. తాత్కాలిక సమస్య వలన శాశ్వతమైన నీ వ్యక్తిత్వానికి లోపం రానివ్వకు. పేరుకి తగ్గట్లు నువ్వెక్కడున్నా సుగంధ పరిమళాలు వెదజల్లుతూ ఉండాలని సదా కోరుకుంటూ నీ మిత్రుడు..

"మానవత్వం పరిమళించే మంచి మనసుకు స్వాగతం.

సమకాలీనం

# యుద్ధం ఎవరి కోసం?

సర్జికల్ స్ట్రైక్స్ పేరిట భారత దేశం ప్రతీకారం చేశానంటుంది. వేల మంది ప్రజలు పండిన పంటను వదలలేక చావో రేవో అంటూ సరిహద్దు గ్రామాల్లోనే ఉన్నారు. కాశ్మీర్‌లో గాయాలను బుల్లెట్‌లతో కెలుకుతూనే ఉంది. ప్రభుత్వం ఇప్పుడు ఈ యుద్ధాన్ని దేశప్రజలపై రుద్దింది. కాశ్మీర్‌లో జులై నుండి ఇప్పటి దాక చనిపోయిన ప్రజలు 90 మంది. యువకులే కాక పసిపిల్లలు వృద్ధులు కూడా వాళ్ళలో ఉన్నారు. 1100 మంది పైగా పాక్షికంగానో, పూర్తిగానో చూపు



కోల్పోయారు. పత్రికల ఆఫీసులపై దాడులు జరుగుతున్నాయి. బయటి ప్రపంచంతో సంబంధాలు తెంచుతూ ఇంటర్నెట్ కట్ చేశారు. పెలెట్ దాడులతో అంతర్జాతీయంగా సమాధానం చెప్పాల్సిన స్థితిలో భారత దేశ ప్రభుత్వం నెట్టబడింది. చర్చలతో కాశ్మీర్ గాయాలు మాన్పాలని ప్రభుత్వం అనుకోవడం లేదు. కాశ్మీరు సంగతేమంటున్న ప్రశ్నకు బెలూచీ స్తాన్ వైపు వేలు చూపి ఒకటంటే రెండనే నాయకుడు మనకున్నాడంటూ జబ్బలు చరుచుకుంటున్నాం.

యుద్ధం వద్దు శాంతి కావాలని మాట్లాడితే దేశ ద్రోహం అవుతుంది. 18మంది సైనికులు మరణిస్తే అందుకు ప్రతీకారంగా చంపడం సబబేనని మురిపెంగా ప్రచారం సాగిస్తుంది. పాకిస్తాన్‌కి బుద్ధి చెప్పాలని ఇక్కడ కోరుకుంటే పాకిస్తాన్‌లోనూ జనం ఇదే కోరుతూ ఉండవచ్చు. రెండు దేశాల అధినేతలు ఒప్పందం చేసుకున్నారా.

ఉనా దాడులకు సమాధానం చెప్పాల్సిన స్థితిలో ప్రభుత్వం పడింది. ఎన్నికలు ముందుకొస్తున్నాయి. ఘర్‌వాపసీ, బీఫ్ పేరిట దాడులు బహుశా ఎన్నికల్లో చిక్కులు తేవచ్చు. మాటలు తప్ప చేతలు లేవని కంపెనీలకు మాత్రమే మంచిరోజులని వాస్తవాలు వెల్లడవుతున్న నేపథ్యంలో పోయేదేముంది పోతే కొన్ని ప్రాణాలు. ప్రజల ప్రాణాలు, సైనికుల ప్రాణాలు పణంగా పెట్టి పాలకుల వైఫల్యాలు సంక్షోభాలు అధిగమించే దురాశలు యుద్ధం రూపంలో వికృతంగా బయటకు వస్తున్నాయి. సవాళ్ళన్నింటికి సమాధానం యుద్ధం. ప్రజాపోరాటాలన్నింటినీ యుద్ధంతో తడిచేయాలని భారత ప్రభుత్వం ఆశపడుతుంది. యుద్ధం కాదు శాంతితో మాత్రమే ఉగ్రవాదాన్ని అణచివేయగలం.

మణిపూసలు

# అనిబిసెంటు

- వకుళాభరణం లలిత



అనిబిసెంటు మేధాశక్తికి, పట్టుదలకు, ధైర్యానికి ప్రతీక. ప్రతి వ్యక్తికీ తనలో దాగున్న దైవత్వాన్ని గుర్తింప గలిగేటట్లు చేసిన సాధ్వీమణి భారతీయ సంస్కృతీ, సంప్రదాయాలకు, తాత్వికతకూ ఆకర్షితమై తాను విదేశీ మహిళ అయినా, భారత దేశాన్ని మాతృదేశంగా భావించిన మహోన్నత వ్యక్తి.

ఐదేళ్ళ వయస్సులో తండ్రి మరణించాడు. తల్లి బాల్యం నుంచీ ఆరాధ్య దైవమే. ఆడుతే, పాడుతూ, కొండలెక్కుతూ, క్రికెట్ ఆడుతూ, ప్రకృతిని ఆరాధిస్తూ బాల్యం గడిపింది. మరియెట్ ఆమెకు ఉపాధ్యాయిని. కుట్టుపని, గుల్లపు స్వారీ మాత్రమే కాక, మత విశ్వాసం, దైవభక్తి కూడా'అనీ' కి చిన్నతనం నుంచీ ఉండేవి. మిషనరీల సేవానిరతిని, తనకు విద్య నేర్పిన మరియెట్ నుండే అలవర్చుకొంది. ఆమెతో కలిసి భక్తి గీతాలు పాడేది. ఆమె వద్ద ఉంటూ ఫ్రెంచ్, జర్మన్ భాషల్లో ప్రావీణ్యం పొందింది. బాల్యంనుంచీ సాహిత్యంతో పరిచయం ఎక్కువ. ఎన్నో గ్రంధాలను చదివి, వాటి సారాన్ని అవగతం చేసుకొంది.

మతగురువు దేవుని సాన్నిధ్యానికి తనను తీసుకెళ్ళగలడనే విశ్వాసంతో 1867లో రెవరెండ్ ఫ్రాంక్‌ను వివాహం చేసుకొంది. నాలుగేళ్ల వివాహ జీవితంలో ఒక కుమారుడు, ఒక కుమార్తె కలిగినా, కుమార్తె అస్వస్థతతో బాధపడే కొద్దీ, తల్లికి మత విశ్వాసం నశించింది. భర్తతో విడాకులు తీసుకొన్నా, బెసెంట్ అనే పేరు వివాహానికి చిహ్నంగా ఆమెకు మిగిలింది. తల్లి మరణించిన తర్వాత 'అనీ'కి బహిరంగ సభలు, ఉపన్యాసాలు మెండయ్యాయి. దేవునిపై విశ్వాసం కోల్పోయింది. 1887లో తానే స్వయంగా దేవునిపై నమ్మకం లేదని ప్రకటించింది. నాస్తికత్వం గూర్చి అనేక పత్రికల్లో వ్యాసాలు ప్రచురించింది. వీటిని 'అయాక్స్' అనే కలం పేరుతో రాసిందామె. 1875 నుంచి సర్వమత సమానత సంఘంలో ఉపన్యసించటం ప్రారంభించింది. అదే సంవత్సరం రష్యన్ యువతి హెలెన్ బ్లావెట్‌స్కీ స్థాపించిన థియోసాఫికల్ సొసైటీలో 1889లో సభ్యురాలైంది. బ్లావెట్‌స్కీ రాసిన 'సీక్రెట్ డాక్ట్రిన్' అనే గ్రంథం అనీ జీవితంలో ముఖ్య మలుపుకు దోహదం చేసింది. థియోసఫీ సిద్ధాంతాలు ఆమెలో ఎంతో మార్పు తెచ్చాయి. ఆమెను కలిసిన అనీ ఆమెకు నమ్మిన బంటు అయ్యారు. అప్పటికే ఆమె భారత దేశాన్ని గూర్చి ఎంతో తెలుసుకొన్నారు. అందులోని ఆంతర్యాన్ని గ్రహించిన అనీ చికాగోలో జరిగిన ప్రపంచ మత సమ్మేళనంలో 'అత్యున్నత విధి' గూర్చి ప్రసంగించారు. మానవాళి సేవ ద్వారా భగవంతుని సేవిస్తున్నాననే భావం ఆమెకేర్పడింది. థియోసాఫికల్ సొసైటీ 1900 నుంచీ క్రమంగా అభివృద్ధి చెందింది. ఆతర్వాత అంతర్గతంగా జరిగిన మార్పుల కారణంగా 1907లో ఆమె దివ్యజ్ఞాన సమాజానికి అధ్యక్షులయ్యారు. జాతి, మత భేదాలు లేని, స్త్రీ, పురుష వివక్షత లేని విశ్వమానవ సౌభ్రాతృత్వా సందేశంతో దివ్యజ్ఞాన సమాజం ఏర్పడింది. ఈ సమాజంలో ఆర్య సాహిత్య అధ్యయనం, తత్వ అధ్యయనం కొనసాగటంతో పాటు మానవుని అంతర్గత శక్తులను పరిశోధించే ప్రయత్నం జరిగింది.

భారతీయ తత్వం, సనాతన ధర్మం, అన్నీ ఆకట్టుకొన్నాయి. మానవులు మంచితనంతో, నిజాయితీతో ఉండాలని ఈ సమాజం విశ్వసించింది. 1895లో భారతదేశానికి వచ్చి, వారణాసిలో స్థిరపడి, ఆమె సామాన్య జీవితం గడిపారు. 'శాంతి కుంజ్' అనే కుటీరంలో నివసించారు. ఆ కుటీరంలో సర్వమానవులకు ప్రవేశార్హత ఉండేది. భారతదేశం ఆధ్యాత్మికతను త్యజించరాదని ఆమె భావించారు. ఆమెలో ఉన్న జ్ఞాన సముపార్జనాభిలాష, దేవాంశ, బ్రహ్మ విద్య, దివ్య జ్ఞానాలను బోధించింది. ప్రపంచ మతాలన్నీ దివ్యజ్ఞానాన్నే సూచిస్తాయని నమ్మింది. స్వదేశీ వస్తువులనే

భారత దేశ భవిష్యత్తును తీర్చిదిద్దిన అగ్రగామి శిల్పుల్లో అనిబెసెంటు ఒకరు. భారతదేశ తత్వాన్ని వంటబట్టించుకొని, సర్వమత సమానతకు ప్రాముఖ్యతను ఇవ్వటమే గావ, సంస్కర్తగా, కార్మిక నాయకురాలిగా పని చేసి, దివ్యజ్ఞాన సిద్ధాంతాలను జీవితంలో పాటించిన మహిళగా, ఈమెను, ఈమె సేవను మరువలేము.

వాదమని ఆమె కోరారు. ముస్లిం - హిందూ ఐకమత్యానికి ఆమె పాటుపడ్డారు. 1894లో భారతజాతీయ కాంగ్రెస్ మహాసభలో ఆమె ప్రసంగించారు. శాయ శక్తులా అతివాద, మితవాదులను ఏకంచేయడానికి ఆమె శ్రమించారు.

1915లో గాంధీజీ దక్షిణాఫ్రికా నుంచి తిరిగి రావడంతో బొంబాయిలో ఆమె ఆయన్ను కలుసుకొన్నారు. 1916లో ఆమెను బొంబాయి నుంచి బహిష్కరించారు. అప్పటి నుంచి మద్రాసు ప్రభుత్వం ఆమెను ఉదక మండలంలో ఉంచింది. ప్రజాందో ళనను తప్పించుకోలేక, ప్రభుత్వం ఆమెను విడుదల చేసింది. స్వాతంత్ర్య శంఖాన్ని పూరించేందుకు ఆనాటి నాయకులు, ఆమె పాశ్చాత్య శరీరంలో ఇమిడిన వజ్రంగా నిరూపించారు.

1917లో జరిగిన హోంరూల్ లీగ్‌లో ప్రముఖ పాత్ర వహించారు. కాంగ్రెస్ మహా సభలను బహిరంగంగా జరిపిన సంస్థ అధ్యక్షులు అనీ బెసెంటు. మహిళల్లో రాజకీయ చైతన్యం కలిగించటానికి నిర్మాణాత్మక కృషి సల్పారు. గాంధీజీ ప్రారంభించిన సహాయ నిరాకరణో ద్యమానికి ఆమె సహకరించలేదు. అప్పటినుంచి కొంత రాజకీయాలకు దూరం అవుతూవచ్చారు. భారతదేశానికి సంపూర్ణ స్వాతంత్ర్యం, సర్వం సహాధికారం లభించాలన్నది ఆమె ఆకాంక్ష.

విద్యారంగంలో అవిరళ కృషిసల్పారు. భారత జాతీయ విశ్వవిద్యాలయాన్ని ఆడయారులో స్థాపించి, దానికి రవీంద్ర నాథ్ ఠాగూర్‌ను ఛాన్సలర్‌గా ఆహ్వానిం చారు. విద్య ద్వారా సాంఘిక విలువలను పెంచాలని ఆశించారు. తల్లిదండ్రులను గౌరవించాలి, మనతో సమానులను ప్రేమతో సోదర సోదరీమణులుగా చూడాలి, చిన్నపిల్లలను సొంత బిడ్డలుగా ఆదరించాలి, నిస్సహాయులను త్యాగనిరతితో చూడాలనీ, విద్యార్థుల వ్యక్తిత్వాన్ని గౌరవించాలనీ విశ్వసించారు.

. జాతి, మత భేదం లేని ఆధ్యాత్మిక తత్వ బోధకురాలిగా అనిబెసెంట్‌ను లక్షలాది మంది గౌరవించారు, ప్రశంసించారు కూడా. భారతదేశ లక్ష్యాలు, తత్వం, నైతిక స్థాయి, పాశ్చాత్య భావాల కన్నా ఉత్తమమని ఆమె భావించారు. 1898లో బెనారస్ కేంద్ర హిందూ కళాశాలను ప్రారంభిం చడానికి కృషి చేశారు. ప్రాచ్య విద్యను పునరుద్ధరించారు. పిల్లలను ప్రేమ, ఆప్యాయత, అవగాహనతో, క్రమశిక్షణతో ఉంచాలన్నది ఆమె ఉద్దేశం.

1887లోనే మదన పల్లి థియో సాఫికల్ పాఠశాలను స్థాపించారు. పంచమ పాఠశాలను కూడా ఏర్పరిచారు.

1916నాటికి ఈట్రస్టు ఆధ్వర్యంలో 14కళాశాలలు, పాఠశాలలు నిర్వహింప బడ్డాయి. వీటిల్లో థియోసాఫికల్ ఎడ్యు కేషనల్ ట్రస్టు పూర్తి బాధ్యత తీసుకొన్నవి కొన్ని, అనుబంధమైనవి కొన్ని. ఎంతోమంది యువతరానికి ప్రముఖ తత్వవేత్త జిడ్డు కృష్ణమూర్తి కార్యకలాపాల్లో పాల్గొనేందుకు ఆమె శిక్షణనిచ్చారు.

1909లో బాలభట సంఘం ప్రారంభమైంది. అట్లే, భారతీయ సంస్కృతికి మూలం మహిళలేననీ, బాలికల విద్యను ప్రోత్సహించాలనీ, దయనీయమైన మహిళల స్థితిగతులను మార్చాలనీ ఆమె విశ్వసించారు.

1911లో "ఆర్డర్ ఆఫ్‌ది స్టార్ ఆఫ్ ది ఈస్ట్" సంస్థను స్థాపించారు. జిడ్డు కృష్ణ మూర్తి అనే ఆయన పట్ల బెసెంటుకు సంపూర్ణ నమ్మకముండేది. ఆయన బోధనలు వింటూ కాలం గడుపుదా మనుకున్నా, అందుకు ఆయన అంగీకరించ లేదు. కృష్ణజీ ఆమెను మనలను గూర్చి శ్రద్ధ వహించిన తల్లి అనిబెసెంటు అనటం మరపురాని ఘటన. ఇది ఉత్తేజకరమైన సందేశం.

అనిబెసెంటు భగవద్గీతను అనువ దించి, 'సనాతన ధర్మా' అనే గ్రంథాన్ని రాశారు. అట్లే, దివ్యజ్ఞాన బోధనలను విస్తరిస్తూ ఎన్నో గ్రంథాలను రాశారు. వాటిలో రెండు పుస్తకాలు ప్రధానమైనవి.

ఒకటి, "ఇనన్‌ది అవుటర్‌కోర్టు" రెండు, "దిపాత్ ఆఫ్ డిసైపుల్‌షిప్" వీటికి తోడు "వేక్ ఆఫ్ ఇండియా" అనే గ్రంథంలో సంస్కరణ భావాలన్నీ ఇమిడి ఉన్నాయి. పద్నాలుగు సంవత్సరాల పాటు "న్యూ ఇండియా" అనే దిన పత్రికలో పని చేశారు. ఆమె దాదాపు 150 పుస్తకాలు రచించారు. భారత దేశ భవిష్యత్తును తీర్చిదిద్దిన అగ్రగామి శిల్పుల్లో అనిబెసెంటు ఒకరు. భారతదేశ తత్వాన్ని వంటబట్టించుకొని, సర్వమత సమానతకు ప్రాముఖ్యతను ఇవ్వటమే గావ, సంస్కర్తగా, కార్మిక నాయకురాలిగా పని చేసి, దివ్యజ్ఞాన సిద్ధాంతాలను జీవితంలో పాటించిన మహిళగా, ఈమెను, ఈమె సేవను మరువలేము. భారతదేశం ఉన్నంతకాలం ఆమె చేసిన మహోన్నత సేవలు మరపుకు రావు. అందుకే, గాంధీగారు -దేశానికి సర్వస్వం అర్పించిన మహిళగా ఆమెను పేర్కొన్నారు. "సహచరునకు మనలో విశ్వాసం లేకపోయినా, మనం అతనికి విశ్వసనీయులుగా ఉండాలి. శత్రువు మనలను బాధపడితే మనం అతనిని క్షమించుదాం మిత్రుడు మనకు మోసం చేసినట్లయితే, మోసం చేసిన మిత్రుని ఆదుకుందాం.''- అన్నవి ఆమె సభాషితాలు. థియోసాఫికల్ తత్వానికి ఆమె చేసిన సేవ అమోఘమైంది. ఈసిద్ధాంతం ప్రపంచంలో ఉన్నంతకాలం, అనిబెసెంటు సజీవంగానే ఉంటారు.

# నదీవేదన

-షేక్ బషీరున్నిసా బేగం

గుండె ఘోష ఎవరికి వినిపించాలనో
కఠిన శిలలపై పడి ముక్కలై పోతూ
చీలిపోతూ చిక్కిపోతూ
నది పల్లానికి పరుగులు తీస్తుంది
తానెరిగిన కథలు
తాను చూసిన జీవితగాథలు
హోరు హోరుమంటూ వినిపిస్తుంది.

అడుగడుగునా కన్నీటి కాల్వలు
కలుపుకుంటూ ఉధృతమవుతూ
దిగువకు జారిపోతూ
సుడులు సుడులుగా తిరుగుతూ
లోకానికి చాటిచెబుతుంది.
ఏ కొండల్లో ఏ కోనల్లో ఉన్నా
కటగండ్లు బలాత్కారాల ప్రమానాలు
అత్యాచారాల అగచాట్లు సహిస్తూ
పంజరాలలో బంధించబడిన బతుకుల
నిస్సహాయంగా దిగులుగా చూసే కన్నుల
వెలుగు రేఖలెరుగని పోరాటాలు
ముగిసేదెపుడంటూ ప్రశ్నిస్తుంది.

తనువంతా నీరవుతూ
ఆవిరై ఆకాశానికి చేరుతూ
తరతరాలుగా తలరాతల్లో
మార్పులేదేమని శోకిస్తూ
కాలమెంతమారినా
మానవదశా దిశల మార్పులేదంటూ
తిరిగి సంద్రాన కలుస్తోంది.

సీరియల్

# మిల్లు పిల్లల మార్చ్



1903 వసంతకాలంలో నేను పెన్సిల్వేనియాలో వున్న కెన్సింగ్టన్‌కు వెళ్ళాను. అక్కడ 75వేల మంది బట్టల మిల్లు కార్మికులు సమ్మె చేస్తున్నారు. వారిలో 10వేల మందికి పైగా చిన్న పిల్లలు. ప్రతిరోజూ పిల్లలు యూనియన్ ఆఫీసుకు వచ్చే వాళ్ళు. వారిలో కొందరికి చేతుల్లేవు. కొందరికి బ్రొటన వేళ్ళు పోయాయి. కొందరికి చేతి వ్రేళ్ళు కణుపుల దాకా పోయాయి. పిల్లలు బలహీనంగా వంగిపోయి వుండేవారు. చాలా మందికి పది సంవత్స రాల వయస్సు కూడా ఉండదు.

చట్టప్రకారం 12 సంוו లు నిండక ముందు పని చేయించడం నిషేధం. కానీ ఈ చట్టం అమలయ్యేది కాదు. ఈ పిల్లల తల్లులు తమ బిడ్డల వయస్సును పెంచి చెప్పేవారు. ఒక్క కెన్సింగ్టన్ బ్లాకులోనే 22 మంది పిల్లలు ఉంటే వారిలో అందరూ 12 ఏళ్ళ లోపువారే. ఆ పిల్లల తండ్రులు గనుల్లో పనిచేసి కొందరు వికలాంగులయ్యారని, మరికొందరు చనిపోయారని వారి తల్లులు చెప్పారు. ఈ స్థితిలో ఆ తల్లుల దగ్గర రెండే మార్గాలున్నాయి. పిల్లల్ని పస్తులు పెట్టడం లేదా వయసు ఎక్కువ చెప్పి పనిలో పెట్టడం.

పెన్సిల్వేనియాలో బాల కార్మికుల గురించిన వాస్తవాలు వార్తాపత్రికల్లో వచ్చేవి కాదు. అదే విషయం నేను పాత్రి కేయులను అడిగాను. మిల్లు యజమాన నులకు వార్తాపత్రికల్లో పెట్టుబడులున్నా యని, కాబట్టి వార్తలు ఇవ్వలేమని వాళ్ళు చెప్పారు.

పిల్లల సమస్య పరిష్కరించాలన్న ఆలోచనతో నేను ఈ పిల్లలతోనే, వాళ్ళ కోసం చిన్న ప్రచారం చెయ్యాలని అనుకొని అందుకవసరమైన ప్లాను ఆలోచించాను

మేము మరుసటి రోజు ఉదయం 'ఇండిపెన్డెన్స్ పార్క్' లో ఆడ, మగ పిల్లల్ని పోగుచేశాం. అక్కడి నుండి కోర్టు హౌస్‌కు బ్యానర్లు పట్టుకుని ప్రదర్శనగా వెళ్ళాం. సిటీహాలు ఎదురుగా మీటింగు జరిగింది, పెద్ద సంఖ్యలో ప్రజలు పోగయ్యారు. వేళ్ళు తెగిపోయి, చేతులు విరిగి, అవిటివాళ్ళయిన పిల్లల్ని ఒక ఎత్తైన బల్లమీద నిలబెట్టాను. పిల్లల చేతులను పైకెత్తి ప్రజలకు చూపించాను. ఫిలడెల్ఫియా రాజభవనాలు ఈ పిల్లల విరిగిన ఎముకల మీద, వాళ్ళ చలించిన హృదయాల మీద, వసివాడిన పసితనం మీద నిర్మించబడ్డాయని ప్రకటించాను. ఈ చిట్టి ప్రాణాలు ఇతరుల సంపద కోసం హరించబడ్డాయి. ఈ దారుణాలేవీ అధికార్లకు పట్టలేదు. ఈ పిల్లలు జాతి భవిష్యత్తు అన్న జ్ఞానం కూడా వాళ్ళకు లేదు.

సిటీహాలు అధికారులు కిటికీల దగ్గర నిలబడి ఈ ప్రదర్శన చూస్తున్నారు. ఈ చిన్నారులను అందరికీ కనపడేట్టు పైకెత్తి, వాళ్ళ చిట్టిచేతులను, కాళ్ళను, బక్కచిక్కిన శరీరాలను చూపించాను. వీళ్ళు ఎత్తుకోవడానికి సులువుగా వున్నారు.

కోట్లకు పడగలెత్తిన యజమానులను ఈ అనైతిక హత్యలు ఆపాలని పిలుపునిచ్చాను. 'కొద్దిరోజుల్లో మీ అధికారం కార్మికులు స్వాధీనం చేసుకుంటారని, అదే జరిగినరోజు లాభాల బలిపీఠం మీద ఏ ఒక్క బిడ్డనూ త్యాగం చేయమని', ఎదురుగా ఉన్న కిటికీల గుండా చూస్తున్న అధికారులను హెచ్చరించాను. తమ కళ్ళు, మనస్సులను మూసుకున్నట్టు గానే కిటికీలను కూడా అధికారులు మూసుకున్నారు.

**ఫిలడెల్ఫియా రాజభవనాలు, ఈ పిల్లల విరిగిన ఎముకల మీద, చలించిన హృదయాల మీద నిర్మించబడ్డాయన్న'** నా ప్రకటనను విలేకరులు ప్రచురించారు. **ఫిలడెల్ఫియా పత్రికలు, న్యూయార్క్ పత్రికలు** నా ప్రకటనపై వాదోపవాదాలు చేసుకున్నాయి. **విశ్వవిద్యాలయాల్లో చర్చలు జరిగాయి.** మత ప్రచారకులు నోరు విప్పారు. ఇదే నేను కోరుకున్నది కూడా. బాల కార్మికుల సమస్యపై ప్రజల దృష్టి నిలిచింది.

100 సంవత్సరాల క్రితం రాక్షసత్వానికి వ్యతిరేకంగా మోగిన "లిబర్టీ బెల్" దేశమంతా పర్యటిస్తోంది. దీనిని చూడటానికి ప్రతిచోట ప్రజలు పెద్ద సంఖ్యలో వస్తున్నారు. దాంతో మాకు ఒక ఉపాయం తట్టింది. తమకు లభించాల్సిన బాల్యం కోసం, స్వేచ్ఛ కోసం సమ్మె చేస్తున్న ఈ చిన్న పిల్లలతో కలిసి దేశమంతా పర్యటించాలని మేము నిర్ణయించుకున్నాం.

ఈ పర్యటన కోసం చిన్నారులను ఒకవారం, 10 రోజులు పంపించమని తల్లి తండ్రులను కోరాను. పిల్లలను క్షేమంగా తీసుకువస్తానని హామీ ఇచ్చాను. వాళ్ళు

ఒప్పుకున్నారు. మా పిల్లల సైన్యానికి 'స్వీనీ' అనే కుర్రాడు మార్షల్‌గా వున్నాడు. సమ్మెలో వున్న కొంతమంది స్త్రీలు, పురుషులు మాకు సహాయంగా వచ్చారు. వీళ్ళకు కూడా కొంత మార్పు వుంటుందని, ఉత్సాహ పడతారనీ భావించాను.

పిల్లలు ఒక తగరపు కప్పు, ప్లేటు, కత్తి, ఫోర్క్‌లు వున్న సంచులను తమ వీపులపై మోశారు. రోడ్లమీద వండుకో వడానికి వీలుగా ఒక వాష్ బాయిలర్‌ను మాతో తీసుకువెళ్ళాము. ఒకడు డోలు, మరొకడు వేణువు పట్టుకువచ్చారు. ఇదే మా బ్యాండ్ **'మాకు ఎక్కువ స్కూళ్ళు, తక్కువ ఆసు పత్రులు కావాలి', 'మాకు ఆడుకోవడానికి సమయం కావాలి', 'అభివృద్ధి వుంది. మరి మాకేం ఉంది?' అనే బ్యానర్లు పట్టుకున్నాము.**

మేము ఫిలడెల్ఫియాలో భారీ సభ జరిపిన చోటు నుండే ఈ ప్రదర్శన ప్రారంభించాము. నేను ఈ పిల్లలను తీసుకొని అధ్యక్షుడు రూజ్‌వెల్ట్‌ను కలవాలని నిశ్చయించుకున్నాను. బాలలపై జరుగు తున్న దోపిడిపి అరికట్టే విధంగా చట్టాన్ని ఆమోదించాలని అతన్ని కోరదలచు కున్నాను. రూజ్‌వెల్ట్ ఆస్టర్‌బే సముద్ర తీరంలో వేసవి సెలవులు గడుపుతున్న తన సొంత పిల్లలతో ఈ పిల్లల పరిస్థితిని పోల్చి చూడమని అడగదలిచాను. అలాగే వాల్‌స్ట్రీట్‌లో వుంటున్న గనుల యజ మాని జె.పి. మోర్గాన్‌ను కూడా కలవాలని అనుకున్నాను. ఇతని గనుల్లో ఎక్కువమంది పిల్లల తండ్రులు పనిచేస్తున్నారు.

మా పిల్లలతో ప్రదర్శనలు జరుపుతూ ఊరూరా తిరుగుతున్నప్పుడు ప్రతి రోజూ మాకు తినడానికి కావల్సినంత తిండి దొరికేది. చెరువులు, కాల్వల్లో స్నానాలతో పిల్లలు చాలా సంతోషంగా వున్నారు. సమ్మె తరువాత వీళ్ళు మళ్ళీ మిల్లులోకి పనికి వెళ్ళాలి. మళ్ళీ ఇలాంటి సెలవులు వీరికి దొరకవనిపించింది. దారిపొడవున మమ్మల్ని కలవడానికి రైతులు గుంపులుగా వచ్చేవారు. వస్తూ వస్తూ పెద్ద బళ్ళతో పళ్ళు, కూర గాయలు తెచ్చేవాళ్ళు. రైతుల భార్యలు పిల్లలకు బట్టలు, డబ్బులు ఇచ్చేవారు. ఇంటర్ అర్బన్ కార్లలో పనిచేసే కార్మికులు మా కోసం కార్లను ఆపేవారు. ఉచితంగా తీసుకువెళ్ళే వాళ్ళు.

నేను, మార్షల్ స్వీనీ కలిసి ముందుగా మేము వెళ్ళబోయే పట్టణాలకు వెళ్ళి అక్కడ పిల్లలు పడుకోవడానికి వసతి, సమావేశాలు జరుపుకునేందుకు హాల్సు ఏర్పాటు చేసేవాళ్ళం.

రోజులు గడుస్తున్న కొద్దీ భరించ లేనంత వేడి పెరిగింది. వర్షాలు లేవు. రోడ్లన్నీ బాగా ధూళితో నిండిపోయాయి. పిల్లలు బలహీన పడ్డారు. అసలే ఆరోగ్య వంతులు కాక పోవడం వలన ప్రయాణం కొనసాగించలేక పోయారు. విడతల వారీగా పిల్లలను తిరిగి ఇళ్ళకు పంపించవలసి వచ్చింది.

మేము న్యూ జెర్సీలోని ప్రిన్స్టన్ శివార్లలో వున్నాము. అక్కడ వాష్‌బాయిలర్‌లో మా మధ్యాహ్న భోజనం వండుకుం టున్నాము. అప్పుడు ఇంటర్ అర్బన్ కారు కండక్టర్ మా వద్దకు వచ్చి పోలీసులు వస్తున్నారని, ఈ పట్టణంలోకి మేము ప్రవేశించడాన్ని నిషేధిస్తూ నోటీసులు ఇవ్వబోతున్నారని చెప్పాడు. ఈ పట్టణంలో మిల్లులు వున్నాయి. ఆ మిల్లు యజమానులకు మేము రావటం ఇష్టం లేదు.

పోలీసులు వచ్చారు. మాతో కలిసి భోజనం చెయ్యమని ఆహ్వానించాము. వాష్‌బాయిలర్ చుట్టూ తగరపు ప్లేట్లు కప్పులతో చేరిన పిల్లలను చూసి నవ్వారు. అభిమానంగా మాట్లాడారు. మేము సిటీ లోకి వెళ్ళకూడదనే విషయం గురించి ఒక్కమాట కూడా చెప్పలేదు.

మేము సిటీలోకి వెళ్ళాము. మీటింగు పెట్టాము. పోలీసుల భార్యలు మా పిల్లలను తీసుకువెళ్ళి ఆ రాత్రికి బాగా ఆదరించారు. ఉదయాన్నే పంపిస్తూ మంచి మధ్యాహ్న భోజనాన్ని పేపర్ నాప్‌కిన్స్‌లో చుట్టి ఇచ్చారు.

బాలకార్మికుల బాధలను ఈ పిల్లల ద్వారా చూపిస్తూ మేము ప్రతీచోట మీటింగులు పెట్టాము. ఒక పట్టణంలో మేయరు, తన దగ్గర తగినంత పోలీసు బలగం లేదని పిల్లలకి రక్షణ ఇవ్వలేమని కాబట్టి మీటింగు పెట్టవద్దు అని అన్నాడు. ' ఈ చిన్న పిల్లలకు ఎప్పుడూ, ఎటువంటి రక్షణ గురించి తెలీదు యువర్ హానర్' అని నేనన్నాను. అలాగే వాళ్ళు రక్షణ లేకుండానే తిరుగుతున్నారని కూడా అన్నాను. దాంతో అతను మా మీటింగ్‌ను జరగనిచ్చారు. న్యూజెర్సీ, ప్రిన్స్టన్‌లో గల గ్రోవర్ క్లీవ్‌లాండ్‌కు చెందిన ఎస్టేట్‌లో ఒక చల్లని, పెద్ద ధాన్యపు కొట్టులో ఒక రాత్రి మేము పడుకున్నాము. వేడి చాలా తీవ్రంగా వుంది. మా పిల్లల ఆరోగ్యం అంతంత మాత్రమే అవ్వడం వల్ల మరింత ఎక్కువ బాధపడు తున్నారు. అప్పుడు అక్కడ స్థానికంగా పేరున్న ఒక హోటల్ యజమాని 'అమ్మా! మీకు, మీ సైన్యానికి ఏమి కావాలో ఆదేశించండి' అని పిల్లలకు అవసరమైన సదుపాయాలు ఉచితంగా ఆ అందజేస్తానని కబురు పంపించాడు.

నేను ప్రిన్స్టన్ మేయర్‌ని కలసి, యూనివర్శిటీ క్యాంపస్‌కి ఎదురుగా వున్న చోట మీటింగు పెట్టడానికి అనుమతి అడిగాను. ఉన్నత విద్యపై మాట్లాడతానని చెప్పాను. అతను అనుమతిచ్చాడు. మీటింగ్‌కు ప్రొఫెసర్లు, విద్యార్థులు, ప్రజలు భారీగా

వచ్చారు. వీరినుద్దేశించి నేను మాట్లాడాను. ఈ బాలకార్మికుల శ్రమను ధనవంతులు దోచుకున్నారని, తద్వారానే వాళ్ళు తమ కొడుకులు, కూతుర్లను ఉన్నత చదువులకు పంపించగలుగుతున్నారని చెప్పాను. ఈ చిన్నారుల చిట్టి చేతుల్ని ఉపయోగించుకొని, వాళ్ళు తమ భార్యలకు కార్లు, కుమార్తెలకు పోలీస్ కుక్కలు, మాట్లాడేందుకు ఫ్రెంచ్ భాషను కొనగలుగు తున్నారని చెప్పాను. మిల్లు యజమానులు ఉయ్యాలల నుండే చిన్నారులను పట్టుకుపో తున్నారని మా సైన్యంలో వున్న పిల్లలకు చాలా తక్కువగా చదవడం వ్రాయడం వచ్చని ప్రొఫెసర్లకు చెప్పాను. ఆ పిల్లలను చూపించాను.

నేను, నాతో ఉన్న చిన్నవాడిని చూపిస్తూ **'ఇతను ఆర్థికశాస్త్ర పాఠ్యపుస్తకం. ఇతని పేరు జేమ్స్ ఆష్‌వర్త్. 10 సం॥ల వయస్సు. రోజూ 75 పౌండ్ల బరువున్న నూలు కట్టలను మోస్తాడు. చూడండి, ఎలా ముందుకు వంగిపోయాడో. ఇతను వారానికి 3డాలర్లు సంపాదిస్తున్నాడు. ఇతని అక్క వారానికి 14 డాలర్లు సంపాదిస్తుంది. వీళ్ళు కార్పెట్ ఫ్యాక్టరీలో రోజుకు 10 గంటలు పనిచేస్తుంటే, ధనవంతుల పిల్లలు ఉన్నత చదువులు చదువుతున్నారు' అని అన్నాను.**

ఆ రాత్రి మేము స్టోనీ బ్రూక్ నది ఒడ్డున బస చేశాము. ఇక్కడే అనేకానేక సం॥ల క్రితం స్వేచ్ఛ కోసం పోరాడిన వాషింగ్టన్ వీరయోధులు బస చేసారు.

మేము జెర్సీ సిటీ నుండి హోబకెన్‌కు మార్చ్ చేశాము. ఫోర్త్ ఎవెన్యూ నుండి మాడిసన్ స్కేర్ వరకు మార్చ్ చేసి అక్కడ మీటింగు పెట్టుకు నేందుకు అనుమతించాలని కోరుతూ న్యూ యార్క్ పోలీస్ ఛీఫ్‌కు రాయబారం పంపిం చాను. ఛీఫ్ నిరాకరించాడు. మేము సిటీలోకి రావడాన్ని నిషేధించాడు.

నేను న్యూయార్క్ మేయర్‌ను కలవ డానికి స్వయంగా న్యూయార్క్ వెళ్ళాను. అతను మర్యాదస్థుడే. అయినా పోలీస్ కమీషనర్ వైఖరిని సమర్థిస్తూ మాకు అనుమతి నిరాకరించాడు. కారణం ఏమిటని అడిగితే అందుకు సమాధానంగా మేము న్యూయార్క్ పౌరులం కాదని చెప్పాడు.

'ఒక సం॥ క్రితం జర్మనీ దేశపు రాజ సత్వం కుళ్ళిన తునక ప్రిన్స్ హెన్రీ ఇక్కడకు వచ్చాడు. అతని బొజ్జను మూడు వారాల పాటు నింపడానికి 45,000 డాలర్ల ఖర్చును సంయుక్త రాష్ట్రాల కాంగ్రెస్ ఆమోదించింది. ఈ ప్రభువు మనదేశ కార్మికుల రక్తం నుండి 40 వేల డాలర్ల డివిడెండ్స్ పొందుతున్నాడు. అతను ఇక్కడి పౌరుడా?" అని మేయర్‌ను అడిగాను.

'నాకు తెలిసిన మేరకు మీరు, న్యూయార్క్ అధికారులు, యూనివర్శిటీ క్లబ్‌వారు కలిసి ఆ పెద్దమనిషికి ఆతిథ్యం ఇచ్చారు. అతను ఈ నూయార్క్ పౌరుడా? అని మళ్ళీ రెట్టించి అడిగాను. 'చైనా పౌరుడు లీవూకి కూడా న్యూయార్క్ అధికారులు ఆతిథ్యం ఇచ్చారు. అతను న్యూయార్క్ పౌరుడా? అతను ఈ దేశం కోసం ఎప్పుడైనా, ఏ సంపదనైనా సృష్టించడా? అని అడిగాను. మేయర్ దగ్గర సమాధానం లేదు.

'కానీ మేయర్ గారు! ఈ చిన్నారులు ఈ దేశ పౌరులు. ఈ దేశం కోసం సంపదను కూడా సృష్టిస్తున్నారు. అటువంటి వీరికి మీ నగరంలో ప్రవేశించే అర్హత లేదా"?

చివరికి అతను మాపోరు పడలేక మాకు అనుమతి ఇచ్చారు.

మేము ఫోర్త్ అవెన్యూ నుండి మాడిసన్ స్క్వేర్ వరకు మార్చ్ చేశాము. మా చుట్టూ వలయంగా పోలీసు ఆఫీసర్లు, కెప్టెన్‌లు, ఇతర అధికార యంత్రాంగం వుండి మాతో పాటు మార్చ్‌లో పాల్గొన్నారు. మా మీటింగుకు బ్రహ్మాండంగా ప్రజలు తరలి వచ్చారు. వాళ్ళకు మిల్లుల్లో పనిచేసే బాల కార్మికుల బాధల గురించి చెప్పాను.

వాళ్ళకు 12 సం॥ల ఎడ్డై డున్‌ఫీని చూపించాను. అతని పని రోజూ 12 గంటలు ఎత్తైన బల్లమీద కూర్చొని, కుడి చేత్తో దారాన్ని ప్రక్క కార్మికునికి అంద జేయడం. ప్రమాద కరమైన యంత్రాల మధ్య కూర్చొని పని చేస్తాడు. చలికాలం, ఎండాకాలం అనే తేడాలేదు. ఆరు ఋతువులూ అతని పని అదే. 3 డాలర్లు అతని ఆదాయం. అలాగే గుస్సీ రాంగ్‌న్యూ అనే చిన్న పాపను కూడా చూపించాను. ఆ పాప మొహంలో బాల్యపు జాడే లేదు. ముసలిదాని మొహంలా వాడిపోయి వుంది. గుస్సీ ఒక ఫ్యాక్టరీలో రోజుకి 12గం॥ల పాటు మేజోళ్లను కట్టలు కట్టే పని చేస్తే, రోజుకి కొన్ని సెంట్లు మాత్రమే కూలీ దొరుకుతుంది.

మేము ఈ సిటీలో వున్నంతకాలం వందలకొద్దీ స్నేహితులు వాళ్ళ ఇళ్ళలో ఈ చిన్నారులను వుంచేందుకు సిద్ధపడ్డారు. మేము మా సమ్మె కోసం పెద్దఎత్తున నిధిని కూడా సమ కూర్చుకున్నాం. 'వన్యప్రాణుల ప్రదర్శన' ను నిర్వహించే బాస్టిక్‌గారి ఆహ్వానం మేరకు మేము మరుసటిరోజు కోనే ఐలాండ్‌కు వెళ్ళాము. ఆ రోజు పిల్లల జీవితాలలో మరపురాని రోజు.

ఆ ప్రదర్శన అనంతరం, ప్రేక్షకులను ఉద్దేశించి నేను ప్రసంగించడానికి బాస్టిక్ ఒప్పుకున్నారు. నేను మాట్లాడుతున్న వేదిక వెనక భాగం రోమన్ చక్రవర్తుల క్రీడా మైదానం చిత్రించబడి వుంది అందులో ఇద్దరు రోమన్ చక్రవర్తులు, ప్రేక్షకులు గీయబడ్డారు. ముందు వరుసలో వున్న ఈ చక్రవర్తుల బొటని వేళ్ళు క్రిందకు చూపుతూ ఉన్నాయి. చక్రవర్తులకు ఎదురుగా జంతువులను వుంచే

ఇనపపూచల బోనులు ఖాళీగా ఉన్నాయి. వాటిలో ఈ చిన్నారులను పెట్టాను. వాళ్ళు ఇనపపూచలను పట్టుకొని నిలబడ్డారు. నేను మాట్లాడడం ప్రారంభించాను.

'మిల్లులు, ఫ్యాక్టరీలలో పని చేస్తున్న చిన్నారులపై యజమానుల వైఖరి ఈ పురాతన రోము ప్రభువుల పరిపాలనను తలపించే విధంగా ఉంది. ఈ పిల్లల పట్ల ఈ పాలకుల వైఖరి ఏ మాత్రం న్యాయంగా లేదని దించి వున్న ఈ బొటనవ్రేళ్ళు సూచిస్తున్నాయి'. ప్రజలు కూడా ఈ పరిస్థితిని మౌనంగా ప్రేక్షకులుగా చూస్తూ ఊరుకున్నారు.

"బడికి వెళ్ళడానికి ఏమాత్రం అవకాశంలేని ఈ పిల్లల రోదనలు ప్రెసిడెంట్ రూస్‌వెల్ట్ వినాలని మేము కోరుకుంటున్నాం. ఈ పిల్లల రోదనలు ప్రెసిడెంట్ రూస్‌వెల్ట్ వినాలని మేము కోరుకుంటున్నాం. ఈ పిల్లలు పెన్సిల్వేనియా బట్టల మిల్లుల్లో రోజుకు 11 నుండి 12 గంటల పాటు పనిచేస్తున్నారు. వీళ్ళు నేసిన కార్పెట్ల మీద మీరంతా నడుస్తున్నారు. వీళ్ళు నేసిన లేసులు మీ కిటికీలకు తెరలుగా వున్నాయి. వీరే మీకు దుస్తులను అందిస్తున్నారు. 50 సం॥ల క్రితం బానిసత్వంకు వ్యతిరేకంగా పెద్దపోరాటం జరిగింది. 50 సంవత్సరాల క్రితం నల్లజాతి పిల్లలని డబ్బులు ఇచ్చి కొనే వారు. నల్ల జాతి పిల్లల అమ్మకాన్ని ఆపడానికి ఎంతోమంది వాళ్ళ జీవితాలను త్యాగం చేసారు. నేడు ఫ్యాక్టరీ యజమానులు వారానికి రెండు డాలర్ల చొప్పున వాయిదాల పద్ధతిలో తెల్లవాళ్ల పిల్లలను కొంటున్నారు.

జార్జియాలో కాటన్ మిల్లుల్లో పగలనక, రాత్రనక పిల్లలు పనిచేస్తున్నారు. అక్కడ పాటలు పాడే పక్షుల రక్షణ కోసం ఒక చట్టం చేశారు. మంచిదే. మరి పాటలే లేని ఈ పిల్లల జీవితాల మాటేమిటి?

ఈ బానిసత్వం నుండి ఈ చిన్నారులకు విముక్తిని ప్రసాదించమని, వారి వేదనాభరితమైన హృదయాల తరుపున నేను ప్రెసిడెంట్‌ను అడుగుతాను.

అలాగే అతను గొప్పలు చెప్పుకుంటున్న సంపద పేదలు, నిస్సహాయులను పీడించడం వల్లే వచ్చిందని కూడా అతనికి చెబుతాను. సమస్య ఏమిటంటే వాషింగ్టన్‌లో వున్న వాళ్ళకు ఇవేమీ పట్టడం లేదు! **రైల్వేల యజమానుల సహాయం కోసం ఒక గంటలో మూడు బిల్లులను ఆమోదించే మన శాసన సభ్యులు కార్మికులు తమ పిల్లలకు సహాయం చేయమని అడిగితే ఆ విషయమై ఆలోచించరు. ఆ పిల్లలకు సహాయం చేయమని అడిగితే ఆ విషయమై ఆలోచించరు. ఆ పిల్లల ఆర్తనాదాలు వాళ్ళ చెవికి సోకడంలేదు.**

ఒకసారి జైలులో వున్న ఒక దొంగను ఎందుకు జైలులో వున్నావని అడిగాను. ఒక జత చెప్పులను దొంగిలించానని చెప్పాడు. అప్పుడు నేను అతనితో "నువ్వు గనక ఒక రైలురోడ్డుని దొంగతనం చేసివుంటే, సంయుక్త రాష్ట్రాల సెనేటర్ అయ్యి వుండేవాడివి" అని అన్నాడు.

ప్రతీ అమెరికన్ బాలుడికి ప్రెసిడెంట్ అవ్వే అవకాశం వుందని మనం చెబుతాము. ఈ చిన్నారులు ఒక్కరోజు మంచి భోజనం కోసం, ఒక్కరోజు ఆడుకునే అవకాశం కోసం, వాళ్ళ జీవితాల్నే సునాయాసనంగా అమ్ముకుంటారు. ఈ చిన్నారులు శారీరకంగా, మానసికంగా ఎదగలేదు. వాళ్ళకు కష్టపడడం తప్ప ఇంకేమీ మిగలలేదు. ప్రతీ ఒక్క అమెరికన్ పౌరుడికి ప్రెసిడెంట్ అయ్యే అవకాశం వుందనే విషయం వినే అవకాశం కూడా ఈ చిన్నారులకు లేదు" అని అంటూ నా ప్రసంగం కొనసాగించాను.

ఒక ప్రక్కనవున్న బోనులను చూపించి, "ఆ బోనుల్లో వున్న కోతుల్ని చూస్తున్నారా" అని అడిగాను. "ప్రొఫెసర్లు వాటికి మాటలు నేర్పిస్తున్నారు. అయితే అవి మాటలు నేర్చుకునేందుకు భయపడు తున్నాయి. ఎందుకంటే మిల్లు యజమానులు వాటిని కొని, ఫ్యాక్టరీలలో బానిసలుగా చేస్తారేమోనని, అవి మనకన్నా తెలివైనవి" ఇలా సాగింది నా ప్రసంగం. ప్రజలు అలాగే స్థాణువులుగా వుండి పోయారు.

మేము సెనేటర్ ఆహ్వానం మేరకు అల్పాహారం చేసేందుకు వచ్చామని, అందుకు అయ్యే ఖర్చు సెనేటర్ వద్ద వసూలు చేయాలిన నేను మేనేజర్‌ని అడిగాను. అతను మాకు ఒక ప్రత్యేక గదిని కేటాయించాడు. అక్కడ పిల్లలకు అల్పాహారం పెట్టారు. అటువంటి అల్పాహారం వాళ్ళ జీవితంలో ఎన్నడూ తిని వుండరు. నేను కూడా తిన్నాను. ఈ మొత్తం ఖర్చు సెనేటర్ ప్లాట్ ఖాతాలో రాసు కోమన్నాను.

మేము ఆస్టర్‌బేకు ప్రయాణం చేశాము. అయితే మమ్మల్ని కలవడానికి ప్రెసిడెంట్ రూజ్‌వెల్ట్ నిరాకరించాడు. మా లేఖలకు సమాధానాలు ఇవ్వలేదు. అయితే మా మార్చ్, దాని పని అది చేసింది. బాల కార్మికులు అనే నేరం చుట్టూ దేశం దృష్టిని ఆకర్షించ గలిగింది.

కెన్సింగ్టన్‌లో బట్టల మిల్లు కార్మికుల సమ్మె ఓడిపోయినప్పటికీ, పిల్లలు మిల్లు పనిలోకి మళ్ళీ వెళ్ళవలసి వచ్చినప్పటికీ పెన్సిల్వేనియా శాసనసభ బాల కార్మికులపై చట్టం చేయకతప్పలేదు. ఫలితంగా 14 సం॥లు నిండని వేల మంది పిల్లలు 'మిల్లు' అనే రాక్షసి నోటి నుండి బయట పడ్డారు. అలాగే బయట వున్న మరికొన్ని వేల మంది పిల్లలు 14 సం॥ల వయసు వరకు మిల్లు లోపలికి అడుగు పెట్టనక్కర లేకుండా రక్షించబడ్డారు.

వీరవనితలు

# సదా అనుసరణీయం.. రాజేశ్వరమ్మ గారి జీవితం..



నిండు నూరేళ్లు పరిపూర్ణమైన జీవితాన్ని అనుభవించిన నాగేళ్ల రాజేశ్వరమ్మ గారు (102) సెప్టెంబర్ 4 కృష్ణా జిల్లా, కాటూరు గ్రామంలో అనారోగ్యంతో తుది శ్వాస విడిచారు. మహిళా ఉద్యమ స్థాపకులలో ఒక మహిళా నేత నేలకొరిగారు. ఆమె మృతి మహిళా ఉద్యమానికి తీరని లోటు.

కృష్ణాజిల్లా గరికపర్రు గ్రామంలో సనాతన సాంప్రదాయ కుటుంబంలో నెక్కలపూడి వెంకయ్య, పార్వతమ్మ దంపతులకు 1915లో జన్మించారు. జాతీయోద్యమం ముమ్మరంగా సాగుతున్న కాలమది. కల్లు దుకాణాలకు వ్యతిరేకంగా "కల్లు మానండోయ్ - కళ్లు తెరవండోయ్" అని మహాత్మగాంధీ పిలుపునందుకొని చిన్నతనంలోనే ఉద్యమంలో పాల్గొన్నారు.

1934లో కాటూరుకు చెందిన నాగళ్ల జానకిరామయ్య గారితో 18 ఏళ్ళ వయస్సులో రాజేశ్వరమ్మగారి వివాహం అయింది. అప్పటికే కాటూరు ప్రగతిశీల ఉద్యమాలకు కేంద్రబిందువుగా ఉంది. పుట్టినింట జాతీయోద్యమ భావాలను అలవరుచుకున్న ఆమె మెట్టినింట వామపక్ష భావాలకు ప్రభావితులయ్యారు. కామ్రేడ్ పుచ్చలపల్లి సుందరయ్యగారి ప్రేరణ, చండ్ర రాజేశ్వరరావు, కడియాల గోపాలరావు, మానికొండ సుబ్బారావుగార్ల ప్రోద్భలంతో సాహిత్యం చదవటం, సమావే శాలకు హాజరు కావటం ప్రారంభిం చారు. తన ఉద్యమ సహచరి మాని కొండ సూర్యావతి గారితో పరియం మరింత ఉద్యమ పథాన అడుగులు వేయటానికి దోహద పడింది.

మానికొండ.సూర్యావతి, డా॥అచ్చమాంబ, వల్లభనేని సీతామాలక్ష్మి, తాపీ రాజమ్మ, వేములపల్లి సత్యవతి, చండ్ర. సావిత్రిదేవి, కాట్రగడ్డ హనుమాయమ్మ, కొండపల్లి. కోటేశ్వరమ్మ మొదలైనవారు మహిళా ఉద్యమానికి ఊపిరిలూదారు. అనేక ఆటుపోట్లు ఎదురైన ఎత్తిన జెండా దించలేదు.

1920, 30 దశకంలో స్వాతంత్రోద్యమంతో పాటు సంస్కరణోద్య మాలు ముమ్మరంగా జరుగుతున్నాయి. కడియాల గోపాలరావు గారు యువతీ, యువకులను సమీకరించి సైద్ధాంతికపుస్తకాలు చదివిస్తూ రాజకీయాలు బోదించేవారు. గోర్కి వ్రాసిన అమ్మ నవల రాజేశ్వరమ్మగారిని ఉత్తేజపరచటమే కాక వామపక్ష సిద్ధాంతాలకు తుదికంటా నిలబడటానికి దోహదపడింది. కడియాల గోపాలరావుగారు కాటూరులో మహిళలతో సమావేశం ఏర్పాటు చేసి ఈడ్పుగంటి సీతామహాలక్ష్మి గారిని ఆహ్వానించారు. ఆమె ప్రసంగం రాజేశ్వరమ్మ గారిని ఆలోచింప జేసింది. స్త్రీల సమస్యలపై ప్రత్యేకంగా మహిళా సంఘాన్ని నిర్మించి మహిళలను చైతన్య పర్చాలని కమ్యూనిస్టు పార్టీ ఆదేశం మేరకు తూర్పు కృష్ణా మహిళా సంఘాన్ని జిల్లా వ్యాప్త సంఘంగా నిర్మించేందుకు విస్తృతంగా గ్రామాల్లో సూర్యావతిగారితో కలిసి పర్యటించారు. 8 దశాబ్దాల క్రితం ఈ నాడు ఉన్న రోడ్లు, రవాణా సౌకర్యాలు ఆనాడు లేవు. కాలినడకన ఒక గ్రామం నుండి మరో గ్రామం మైళ్ల దూరం పొలం గట్ల వెంబడి నడవవల్సి వచ్చేది. సరైన రహదారులు కూడా లేవు. సమాజంలో ఆనాడు ఉన్న సామాజిక పరిస్థితులు ముఖ్యంగా మహిళల్లో అణచివేత దారుణంగా ఉండేది.

మహిళలు ఇంటి నుండి బయటికి రాకూడదని ఘోషా పద్ధతి ఉండేది. బాల్య వివాహాలు సర్వసాధారణం. కన్యాశుల్కం ఆశతో ముసలివారికి పసిపిల్లలను కట్టబెట్టేవారు. యుక్తవయస్సు రాకుండానే వితంతువుగా మారిన బాలికలు పునర్వివాహానికి అనర్హులు. స్త్రీలు చదువుకోకూడదనే ఆంక్షలు ఉండేవి. మూఢాచారాలు, సనాతన భావాలు ప్రబలంగా ఉండేవి. గ్రామాల్లో మరుగు దొడ్లు లేక మహిళలు ఇబ్బందులు ఎదుర్కొనేవారు. ప్రసూతి సౌకర్యాలు ఉండేవి కావు. మంత్రసానితో పురుడు పోయించడం వలన తల్లి, బిడ్డ వైద్య సదుపాయం లేక ఒక్కొక్క సందర్భంలో మృత్యువాత పడేవారు. భర్త చనిపోతే ఆస్తిలో

ఇంటికి వెళ్లిన కార్యకర్తల ఎడల ఆమె చూపే ఆప్యాయత, సాన్నిహిత్యం, అందర్నీ ఆమెకు దగ్గర చేసేది. కార్యకర్తలు ఎప్పుడు ఇంటికి వెళ్లినా మహిళా సంఘ నిర్మాణం గురించి నొక్కి చెప్పేవారు. ప్రాథమిక కమిటీలు, స్థానికసమస్యలు తీసుకొని పనిచేయాలని లేకపోతే సంఘ నిర్మాణం కుంటుపడుతుందని చెప్పేవారు. ఎప్పుడు ఆమెను కలవడానికి వెళ్లినా సమయం వృథా చేయవద్దని చెప్పేవారు.

భార్యకు వాటాలేదు. ఆనాడు స్త్రీలకు ఆస్తి హక్కులేదు. ఫ్యూడల్ బంధనాలతో మధ్యతరగతి కుటుంబాల్లో మహిళలు ఆర్థిక ఇబ్బందులున్నా వ్యవసాయ పనులు, ఇతర వృత్తుల్లో బయటికి వెళ్లి పనిచేసే అవకాశాలు ఉండేవి కావు.

అలాంటి పితృస్వామ్య భావాలు ఉన్న రోజుల్లో మహిళల వివక్షత, అణచి వేతకు వ్యతిరేకంగా గ్రామాల్లో ప్రచారం చేస్తూ సంఘ నిర్మాణాన్ని పూనుకోవడం సాహసో పేతమైన చర్య. ఆనాటి సమాజంలో ఉన్న కట్టుబాట్లను, ఆంక్షలను ఎదిరించి పోరాడటం అంటే చిన్నవిషయం కాదు. మగవారి హేళనలు ఒక వైపు, మరోవైపు అణచివేతకు గురవుతున్న మహిళల నుండి చీత్కారాలు ఎదుర్కొన్న పరిణామానికి ఒకింత నిరుత్సాహపడినా నాయకుల ప్రోత్సాహంతో మరల కార్యా చరణలోకి దిగేవారు.

గడపదాటి మహిళలు బయటకు రానిరోజుల్లో 1956లో కాటూరు గ్రామ పంచాయితీకి ఏకగ్రీవంగా సర్పంచ్‌గా ఎన్నికైన తొలి మహిళ. అధికారాన్ని ఉపయోగించుకొని గ్రామాభ్యుదయానికి కృషి చేసి పరిపాలనలో పురుషులకు మేమేమి తీసుపోమని నిరూపించారు. చాందన వాదులు అనేక ఆటంకాలు కల్గించేవారు. ఉద్యమంలో పనిచేస్తున్న మహిళల కుటుంబాల్లో భర్తలను రెచ్చగొట్టి బయటకు రానీవ్వకుండా అడ్డంకులు కలిగించేవారు. మహిళలకు నాయకత్వం వహిస్తున్న రాజేశ్వరమ్మగారి భర్త జానకిరామయ్య గారిని కూడా రెచ్చగొట్టే ప్రయత్నం చేసారు. కానీ ఆయన రాజేశ్వరమ్మగారి కర్తవ్యానికి ఆటంకాలు కల్పించలేదు. అనేక ఆటుపోట్లు, ఇబ్బందులు ఎదురైన దోపిడీ రహిత సమాజం కోసం తుదికంటా నిలబడ్డారు. ఆమె మంచి కార్యకర్తగా, మంచి వక్తగా పేరుగాంచింది.

రాజేశ్వరమ్మగారు చదివింది ఐదో తరగతి మాత్రమే. కానీ ప్రతిరోజూ తన రోజువారీ దినచర్యను ప్రతి అంశాన్ని డైరీలో వ్రాసేవారు. ఆ డైరీని కృష్ణాజిల్లా కమిటీ ఆమె జీవించి ఉండగానే పుస్తకం తీసుకు వచ్చారు. ఆవిడ అనుభవాలను ఆనాటి మహిళల స్థితిగతులను ఈనాటి తరం అధ్యయనం చేయాలి. వారి త్యాగాలు, నిర్వహించిన ఉద్యమాల ఫలితంగా మహిళలు ఈనాడు అన్ని రంగాలలో రాణిస్తున్నారు.

ఆంధ్రవిశ్వవిద్యాలయంలో స్నాతకోత్స వంలో మహిళాభ్యుదయం పై ప్రసంగించ డానికి రాజేశ్వరమ్మగారిని ఎంపిక చేసారు. యూనివర్సిటీలో పెద్ద చదువులు చదువుకున్న వారి ముందు నేను మాట్లాడలేనని సందేహిస్తే నాయకులు ప్రోత్సహించి సభకు పంపారు. సభలో రాజేశ్వరమ్మగారు మహిళా సమస్యలపై ఇచ్చిన ప్రసంగం సభికులను ఉత్తేజపరిచింది. ఆమెను ప్రశంసలతో ముంచెత్తారు. ఆమె ఐదో తరగతి వరకే చదువుకున్నారని తెలిసి నివ్వెరపోయారు. ఆమె డైరీలో ఈ అంశాన్ని పొందుపరుస్తూ కమ్యూనిస్టు పార్టీ కార్యకర్తలకు శిక్షణ ఇవ్వటం వల్లనే నేను ఆ స్థాయిలో ఎదగలి గాను అని వ్రాసుకున్నారు. అసెంబ్లీలో అయ్యదేవర కాళేశ్వరావుగారు "సుందరయ్య గారికి సమాధానం చెప్పగలమేమోగానీ కాటూరు మహిళా ఉద్యమనేత రాజేశ్వరమ్మ గారికి సమాధానం ఇవ్వటం కష్టం" అని ఒక సందర్భంలో ప్రకటించారు.

పార్టీ నిషేదం ఉన్న కాలంలో రహస్యంగా పనిచేయాల్సి వచ్చేది. రాత్రిపూట మహిళలు మీటింగ్‌కి వెళితే అనేక అపవాదులు సృష్టించేవారు. ఎన్ని నీలాపనిందలు వేసినా నమ్మిన సిద్ధాంతం కోసం వెనుకడుగు వేయలేదు. చివరకు కన్న కూతుర్ని చంటిపిల్లను కూడా వదిలేసి, భర్తను పట్టించుకోకుండా తిరుగుతోందని బంధువులు, ఇరుగుపొరుగు విమర్శించినా ఉద్యమంవైపే అడుగులు వేసింది. సమాజ

మార్పుకు కృషి చేయాలనే తపన, అంకిత భావం, పట్టుదల రాజేశ్వరమ్మ గారిలో మెండుగా ఉండేది. 90యేళ్ల వయస్సులో కూడా నేనేమీ చేయలేక పోతున్నానని బాధపడేది. ఇంటికి వెళ్లిన కార్యకర్తల ఎడల ఆమె చూపే ఆప్యాయత, సాన్నిహిత్యం, అందర్నీ ఆమెకు దగ్గర చేసేది. కార్యకర్తలు ఎప్పుడు ఇంటికి వెళ్లినా మహిళా సంఘ నిర్మాణం గురించి నొక్కిచెప్పేవారు. ప్రాథమిక కమిటీలు, స్థానికసమస్యలు తీసుకొని పనిచేయాలని లేకపోతే సంఘ నిర్మాణం కుంటుపడుతుందని చెప్పేవారు. ఎప్పుడు ఆమెను కలవడానికి వెళ్లినా సమయం వృథా చేయవద్దని చెప్పేవారు.

కృష్ణాజిల్లాలో 1992లో మహిళా న్యాయసలహా సంఘాన్ని స్థాపించటంలో సూర్యావతిగారితో పాటు రాజేశ్వరమ్మగారి ప్రోత్సాహం ఎనలేనిది. కాటూరులో ఆమె ఇల్లు భార్యా భర్తల తగాదాలు పరిష్కరించే వేదికగా ఉండేది. చుట్టుప్రక్కల గ్రామాల నుంచి కూడా భార్యాభర్తల సమస్యలపై ఆమె సలహా కోసం వస్తుండేవారు. ఆమె పరిష్కారం చేయులేని కేసులు జిల్లా సెంటర్‌కు పంపించేవారు. జిల్లాలో జరిగిన సారా మధ్యనిషేధ ఉద్యమాల్లో 80 యేళ్ల వయస్సులో కూడా చురుకైన పాత్ర వహించారు. మహిళా ఉద్యమ అవసరాలకు లెవీ వసూలు చేయడంలో ఆమెకు ఆమే సాటి. ఆమె తన వంతుగా మహిళా సంఘానికే కాగా ప్రజాతంత్ర ఉద్యమానికి నిధి వసూలు చేయడంలో ముందుండేవారు. 1955లో ఇన్సురెన్స్ తాలూకా వచ్చిన డబ్బులు బ్యాంక్‌లో ఫిక్సడ్ డిపాజిట్ చేసిన 3లక్షల రూపాయలు పార్టీకి విరాళంగా అందజేశారు.

రాజేశ్వరమ్మగారు చదివింది ప్రాథమిక విద్య అయినా రాజకీయాలను, ప్రజల సమస్యలను క్షుణ్ణంగా అధ్యయనం చేసింది. మామ్మ మంచం పక్కనే టీపాయ్ పైన దిన పత్రికలు, సాహిత్యం, డైరీలు, పెన్ను ఉండేవి. ప్రభుత్వ విధానాలపై బిన్నాభి ప్రాయము ఏర్పడినప్పుడు వెంటనే చెప్పదలచిన విషయాన్ని సూటిగా లెటర్ వ్రాసేది. పత్రికలకు పంపేది. మామ్మలో ఉన్న మరో గొప్ప విషయం ఏ సమాచా రాన్నైనా ఫైలింగ్ చేయడం. ప్రస్తుత కార్యకర్తలం మామ్మలో ఉన్న ఈ సుగుణా లను అలవరుచు కోవల్సిన అవసరం ఉంది. ఆనాటి నాయకత్వం ముళ్ళబాటలో సమాజానికి ఎదురీది ఉద్యమాలు నిర్మించారు. ఆపోరాటాల ఫలితంగానే మహిళలకు అనేక హక్కులు సాధించుకున్నాం.

దేశ వ్యాప్తంగా మహిళా ఉద్యమాలు నేడు గతానికన్నా భిన్నమైన సవాళ్ళను ఎదుర్కొంటున్నాయి. ఒకవైపు పెట్టుబడిదారీ విధానపు బహుళ శక్తి వంతమైన అంతర్జాతీయ మార్కెట్లు ప్రజల ఆలోచనల్ని ప్రభావితం చేస్తున్నాయి, ప్రకటనల ద్వారా లోబరుచుకుంటున్నాయి. జాతీయ సర్వే లెక్కల ప్రకారం 40 శాతం కుటుంబాలు మహిళలపై ఆధారపడి నడుస్తున్నాయి. ప్రభుత్వ విధానాల వలన సాంప్రదాయంగా మహిళలు పని చేస్తున్న పరిశ్రమలు, వ్యవసాయ రంగంలో ఉపాధి భద్రత కరవుతోంది. ఈకాలంలో ఉపాధి కోసం మహిళల వలసలు పెరిగాయి.

అంతర్జాతీయ సంస్థలు వాటి విధానా లను కొమ్ముకాసే ప్రభుత్వాలు అమలు చేస్తున్న విధానాల వలన స్త్రీల సమానత్వం, విముక్తి అటుంచి, కనీస సౌకర్యాల్ని పొందే హక్కులు హరించబడుతున్నాయి. సమాజం లో చోటు చేసుకున్న అనేక మార్పులకు అనుగుణంగా మహిళల స్థితిగతుల్లో కూడా అనేక మార్పులు వచ్చాయి. అయినప్పటికీ మహిళకు స్వేచ్ఛ, సాధికారిత సమకూరనే లేదు. ప్రధానంగా మత చాంధస శక్తుల పితృ స్వామ్య భావజాలం ఆటంకంగా వుంది. దీనికి తోడు పెట్టుబడిదారీ విష సంస్కృతి తోడయ్యింది. సరళీకరణ విధా నాలు మహిళలను మరింత సమస్యల వల యంలో చుట్టుముట్టాయి. ఒక ప్రక్క స్మార్ట్ సిటీలు, బుల్లెట్ ట్రైన్‌లు, సింగపూర్ సిటీలు అంటూ అత్యాధునిక జీవనశైలి అందిస్తా మని చెప్తున్న శక్తులే మహిళలపై కట్టు, బొట్టు ఎలా ఉండాలి. సెల్‌ఫోన్ వాడాలా, వద్దా, పిల్లల్ని ఎంతమందిని కనాలి, ఎవరిని వివాహం చేసుకోవాలని సూక్తులు చెప్తు న్నారు. మహిళల వస్త్రధారణ వలనే అత్యా చారాలు పెరగటానికి కారణం అవుతున్నా యని సంధిప్రేలాపనలు చేస్తున్నారు. మత సంస్థలు మహిళలను తిరోగమన భావాల వైపు నెట్టే ప్రయత్నం చేస్తున్నారు. మరోవైపు పురుషాధిక్యత విలువలు, సంస్కృతులు పెంచి పోషిస్తున్నాయి. కుటుంబ వ్యవస్థ లోనూ, విద్యావిధానంలోనూ మార్పులు రావాలి. విధాన నిర్ణయాలు చేసే చట్టసభల్లో మహిళా రిజర్వే షన్ కోసం 1996 నుండి మహిళా సంఘాలు పోరాడుతున్నాం. ప్రజాస్వామ్యం, సమా నత్వం, స్త్రీ విముక్తి ఆశయాల కోసం అశేష త్యాగాలు చేసిన వారి బాటలో పయనిద్దాం. అవే మనం వారికియిచ్చే నివాళులు.

కె. స్వరూపరాణి,
ఐద్వా ఉపాధ్యక్షురాలు

కథ

# వెంపర

- రాధిక



ఆకాశం... అంతా శూన్యం అని తెలిసినా ఎప్పుడు చూసినా మనసును పరవశింపజేస్తూనే ఉంటుంది. ఇవాళెందుకో మరీ అద్భుతంగా.... నన్ను తన వైపు పిలుస్తున్నట్లుగా అనిపిస్తుంది. ఆకాశం నిండా వేలకోట్ల నక్షత్రాలు.... మనుషులని అత్యంత ప్రేమించే వ్యక్తి వారిని ఆనందంలో ముంచెత్తటానికి తెచ్చి అతికించి ఉంటాడు. ఆ నక్షత్రాల దగ్గరకు వెళ్ళి చూస్తే బాగుండు. అనుకున్నదే తడవుగా నా శరీరం గాలిలోకి తేలసాగింది. శరీరం అంతా తేలికైనట్టు ఒక వింత అనుభూతి కలుగుతోంది. కాసేపట్లో నేను ఆ చుక్కల దగ్గర వుంటానన్న మాట. ఆ ఆలోచనకే సమ్మోహితు డనయ్యాను. నా ప్రయాణం సాగుతూ వుంది. దగ్గరకు వెళ్ళేకొద్దీ నక్షత్రాలు ఇంకా అద్భుతంగా కనపడసాగాయి. అవి కొద్దిగా కదులు తున్నట్టు కూడా వున్నాయి. ఇప్పుడు అంతా స్పష్టంగా కనబడుతుంది. ఎంత ఆశ్చర్యం.... ఎంత అద్భుతం.... అని నక్షత్రాలు కావు. రంగురంగుల సీతాకొకచిలకలు! మిరుమిట్లు గొలిపే ఆ రెక్కల వెలుగులతో ఆకాశాన్నంతా ఒక వింత సోయగంతో అవి వెలిగిస్తు న్నాయి. నేను ఆనందానుభూతితో అటూ ఇటూ తేలుతూ వాటిని చూడసాగాను. ఒక్కొక్కటీ ఒక్కొక్క సొగసుతో, మెరుపుతో మెరిసిపోతున్నాయి. వాటి రెక్కలనుంచి వచ్చే శబ్ధం ఆకాశమంతా వ్యాపిస్తూ ఉంది. అంతలో ఎక్కడి నుంచో ఒక వింత శబ్ధం. సీతాకోక చిలకలన్నీ ఆ శబ్ధం వచ్చిన దిశగా వెళ్ళసాగాయి. వేల వేల సీతాకోక చిలుకలు అన్ని మూలల నుంచి ఆ శబ్ధం వినబడిన వైపు ఎగరసాగాయి. ఏముందక్కడ?

నేను అక్కడకు వెళ్ళాను. ఒక సీతాకోక చిలుక చుట్టూ మిగిలినవన్నీ సభ తీరి ఉన్నాయి. ఆ సీతాకోకచిలుక మిగిలిన వాటి కంటె కొంచెం తేడాగా ఉన్నట్లు అనిపించింది.

“దయచేసి నన్ను వదిలేయండి” వేడు కుంటుంది ఆ సీతాకోకచిలుక “కుదరదు. నువ్వు చావాలసిందే” తీర్మానించాయి మిగిలిన సీతాకోక చిలుకలు.

“నేను మీ కంటే బాగా పాడగలను, నాట్యం చేయగలను, మంచి తేనె సంపా దించగలను. నేను చేయలేనిది ఒక్కటే. మీ అంత బాగా ఎగరలేను. ఎగరటానికి ఎంతో ప్రయత్నం చేస్తున్నాను. కొద్ది రోజులలో నేను సాధించగలను. అప్పటి వరకు నాకు గడువు ఇవ్వండి” పాపం దయనీయంగా వేడుకుంటుంది ఆ సీతాకోకచిలుక.

“నువ్వు మాలాగా లేవు. మాలో ఉండటానికి నీకు అర్హత లేదు”. సీతాకోక చిలుకలు అన్నివైపుల నుండి దానిపై దాడిని మొదలుపెట్టాయి.

కొన్ని దాని కాళ్ళను విరగగొట్టాయి. కొన్ని దాని రెక్కలను ముక్కలు చేసాయి.

“అయ్యో చంపొద్దు. దయచేసి దానిని చంపొద్దు... అయ్యో... అయ్యో...”

నెమ్మదిగా కళ్ళు తెరిచాను. తెల్లవారుజము అయినట్లుంది. ఎదురుగా గోడమీద క్యాలెండర్ కాగితం రెపరెప లాడుతుంది. ఎక్కడ ఏమి జరిగినా తనకేమీ పట్టనట్లుగా సాగిపోతున్న కాలాన్ని అంకెల్లో, అక్షరాల్లో పట్టి చూపెడుతోంది. ‘1970 ఆగస్టు 4’ నా ప్రమేయం లేకుండానే నా కళ్లు చాలానే చదివేశాయి.

ఎక్కడినుంచో రోకళ్ళ శబ్ధం వినపడు తోంది. పాలేర్లకు సద్ది తీసుకు వెళ్ళడానికి జొన్నలు తొక్కుతున్నట్టు ఉన్నారు, ఆకాశం వైపు చూశాను. ప్రశాంతంగా ఉంది. మెల్లగా లేచి కూర్చున్నాను.

ఎదురింట్లో అరుగు కడిగి కళ్ళాపు చల్లుతున్నారు. ఆ చల్లిన నీరు పల్లం వైపు పారుతూ వుంది. ఆమె కొడుకనుకుంటాను.





చల్లా ఓబులేసు
కమిషనర్, అనంతపురం

ప్రభాకర్ చౌదరి, ఎమ్మెల్యే

మదమంచి స్వరూప, మేయర్

# అనంతపురం నగరపాలక సంస్థ

## సాధించిన ప్రగతి 2015-16

- నగరపాలక సంస్థ నిధులతో రోడ్లు, కాలువలు, పార్కులు, నీటి సరఫరా, వీధి దీపములకు సంబంధించిన 177 అభివృద్ధి పనులను రూ.1328.89 లక్షలతో చేపట్టడం జరిగినది.
- స్వచ్ఛంద్ర కార్పొరేషన్ వారి నిధులతో 305 వ్యక్తిగత మరుగు దొడ్లను నిర్మించడమ జరిగినది.
- మొక్కలు నాటు కార్యక్రమంలో భాగంగా 86990 మొక్కలను నాటడం జరిగినది.
- 13వ ఆర్థిక సంఘం నిధులతో 7 పనులను రూ.309.40 లక్షలతోచేపట్టడం జరిగినది.
- విద్యుత్ శక్తి ఆదాలో భాగముగా నగరంలో9290 యల్ఇడిలను వేయడం జరిగినది.
- వివిధ ప్రదేశములలోని 37 మురికి కాలువలందు రూ.52.77లక్షలతో క్లీన్ చేయడం జరిగినది.
- పట్టణములోని ప్రధాన రహదారులందు గుంతలను పూడ్చుట రూ. 29.75 లక్షలతో చేపట్టడం జరిగినది.
- నీరు-ప్రగతి వనం పార్కుల అభివృద్ధికి గాను రూ. 88.00 లక్షలను చేపట్టడము జరిగినది.



## కార్యచరణ ప్రణాళిక

- రాష్ట్ర ఆర్థిక సంఘం మరియు నాన్-ప్లాన్ గ్రాంటు క్రింద రోడ్లు మరియు కాలువలు రూ. 3396.79 లక్షలతో 57 పనులను చేపట్టబడును.
- ప్లాన్ గ్రాంటు క్రింద బ్యూటిఫికేషన్‌లో భాగముగా రూ.73.73 లక్షలతో 3పనులను చేపట్టబడును
- 13 ఆర్థిక సంఘం క్రిద కాలువలు మరియు నీటి సరఫరా సంబంధించిన రూ.595.75 లక్షలతో 51 పనులన చేపట్టబడును.
- రాష్ట్ర ఆర్థిక సంఘం క్రింద రోడ్లు మరియు కాలువలు వేయుటకు రూ. 85.65లక్షలతో 12 పనులను చేపట్టబడును
- అమృత్ పథకము క్రింద క్రింద రూ. 50.00 లక్షలతో పార్కు అభివృద్ధి చేపట్టబడును.
- ఆంధ్రప్రదేశ్ మున్సిపల్ డెవలప్‌మెంట్ ప్రాజెక్టు క్రింద రెండు సంవత్సరముల ప్రాజెక్టు రూ. 191.00 కోట్లతో నగరములోని 323 కి.మీ పైపులైను మార్పు చేయుట మరియు 10నెంబర్లు ఇ.యల్.యస్.ఆర్.లను కట్టబడును.
- వ్యక్తిగత మరుగుదొడ్లు 539 నెంబర్లకు చేపట్టబడును.
- కమ్యూనిటి టాయ్‌లెట్స్ 10 ప్రదేశములందు స్వచ్ఛాంద్ర కార్పొరేషన్ మరియు నగరపాలక సంస్థ నిధుల నుండి చేపట్టబడును.



24 A

# SSC RESULTS -2016

NRI's Indian Springs
LEARN TO LEAD
The School by NRI Educational Society




ఒత్తిడిలేని విద్యకు శ్రీకారం చుట్టిన
మొట్టమొదటి కార్పోరేట్ పాఠశాల -
ఇందుకు మా ఫలితాలే నిదర్శనం

For Admissions Contact :
Ph.No : 9533657575,
Land Line : 7670820067/ 68

24 B


10/10
H.No. 1619118661
S.AKSHAYA


10/10
H.No. 1619120802
E.SAI SINDHURI


10/10
H.No. 1619119893
E.RANJITH KUMAR


9.8
H.No. 1619120980
P.SAHITHI


9.8
H.No. 1619119375
B.SNEHA SRIJA


9.8
H.No. 1619122143
P.SRUTHI


9.8
H.No. 1619117959
O.KEERTHI YADAV


9.8
H.No. 1619118439
K.YUVARAJ


9.8
H.No. 1619122183
V.ROHITH


9.8
H.No. 1619119029
P.M.VENKATESH


9.8
H.No. 1619119577
A.GUNAVARDHAN


9.7
H.No. 1619121110
S.NOOR MOHAMMAD


9.7
H.No. 1619120027
A.GUNASEKHAR


9.5
H.No. 1619120250
D.NIRANJAN


9.5
H.No. 1619121516
G.GOWTHAM REDDY


9.5
H.No. 1619122241
J.GANESH REDDY


9.3
H.No. 1619120842
G.RENU


9.3
H.No. 1619121811
N.MAHITHOSH


9.2
H.No. 1619118907
K.CHETHAN

9.2
H.No. 1619118615
S.JYOTHEESWAR


9.0
H.No. 1619118283
T.REVANTH

Sri Sai

Aloe vera

NATURAL JUICE

Net. 500ml

Directions for use :
30 ml. twice a day
60 ml. once a day

Shake well before use.
Store in a cool and
dry place.

Caution
Avoid during Pregnancy.
Store out of reach of Children.

Best within 12 months
from the date of packing

Mfg. Lic. No.
119/Div III/FI/ATP/2008-09

Sri Sai

Aloe vera

NATURAL JUICE



Natural
Nutritional
Food

Contents
Vitamins
Amino Acids
Minerals
Enzymes
Saponins
Polysaccharides

Ingredients
Stabilized Aloe Vera Juice
Water and
Class II Preservatives



Hemanth Sai
HERBAL PRODUCTS
Opp. Agriculture Research Centre
Hindupur Road, KADIRI
Cell : +91 98661 37881, +91 9703736477
e-mail : hsai_hp@rediffmail.com









- మధుమేహం (చక్కెర వ్యాధి)
- జీర్ణసంబంధ సమస్యలు
- మొలలు
- స్త్రీల సమస్యలు
- ఒబెసిటి






Hemanth Sai
HERBAL PRODUCTS
MOBILE: 8008892223

24 C




ప్రకాశం జిల్లా మార్కాపురంలో శిక్షణా తరగతులు మరియు ప్రెస్‌మీట్




అక్టోబర్2 నుండి కన్యాకుమారి దేశవ్యాప్తంగా మద్య విముక్తికై భారత్ ఆందోళన యాత్ర సందర్భంగా బహిరంగ సభలో మాట్లాడుతున్న మేధాపట్కార్, రమాదేవి



గురజాడ జయంతి సందర్భంగా ప్రకాశం జిల్లాలో స్కూల్ విజిట్



కర్నూలు జిల్లాలో వినతిపత్రం ఇస్తున్న అలివేలు, పద్మ తదితరులు



అనంతపురం జిల్లాలో సెప్టెంబర్2 సందర్భంగా కరపత్రాలు పంపిణీ చేస్తున్న సావిత్రి



విశాఖ ఏజెన్సీలో ఉచిత మెగా వైద్య శిబిరాన్ని ఏర్పాటు చేసిన ఐద్వా సంఘ సభ్యులు



విశాఖ జిల్లాలో గురజాడ జయంతి సందర్భంగా స్కూల్స్ విజిట్




విశాఖ సెమినార్‌లో మాట్లాడుతున్న కేరళ కార్మిక శాఖా మంత్రి మెర్సీకుట్టీఅమ్మ

> **పొలంపని చేసిన బండబారిన ఆ చేతితో పచ్చి మిరపకాయలు, వెల్లుల్లి చిదిమి అందులో చింతపండు, ఉప్పు కలిపి పచ్చడి చేస్తుంది. ఆమె ఆ పచ్చడి చేసేలోపే పిల్లలకు నోట్లో నీరు ఊరుతుంటుంది. ఆమె మనసులోని అమృతం ఆ పచ్చడిలో కలుపుతుందేమో అది తింటున్నప్పుడు పిల్లల ముఖాలలో కొత్త జీవనం చేరినట్లు ఉంటుంది. అప్పుడప్పుడే తోడుకుంటున్న పెరుగు వేసి పిల్లలకు ముద్దలు పెట్టేది. ఎంత సున్నితంగా ఉండేవాడు చదువుకునే రోజుల్లో, చెట్టుకు కూడా జీవం ఉంటుందని క్లాసులో టీచర్ చెప్పినప్పటి నుంచీ చీకటి పడితే చెట్టుని ముట్టుకు నేవాడు కాదు. మేము ఆకు కొయ్యబోయినా అది నిద్రబోతుంది కొయ్యొద్దు అని వారించేవాడు. ఆడపిల్లల జీవితాలు వాడికి చెట్టు ఆకు కంటే తేలిక అయ్యాయా అనిపించేది.**

పువ్వు ఒకటి తీసుకొని ఆ పారే నీటిలో వేస్తున్నాడు. అది నీటితోపాటు కొంత దూరం వచ్చి ఆగిపోతుంది. మళ్ళీ ఆ పువ్వును తీసికెళ్ళి పైన వున్న పారే నీటిలో వేస్తున్నాడు. జీవిత చక్రం తిరుగుతున్నట్లు, అంతా మొదటికే వస్తున్నట్లు ఉందా దృశ్యం. ఊరంతా ప్రశాంతంగా ఉంది ఏమీ జరగనట్టు. మొదటిసారి ఈ ఊరికి వచ్చినప్పటి విషయాలు జ్ఞాపకానికి వచ్చాయి. సారధి, రమణలతో వచ్చి రెండు రోజులు ఉన్నానప్పుడు. ఇక్కడినుంచి ఎప్పుడో ఒక్కసారి మాత్రమే బస్సు ఉండేది. రమణ, సారధి ఇంకా చాలామంది పిల్లలు నడిచే వచ్చేవారు. చాలామంది ఊరివాళ్ళ చదువులు చెరువుగట్టుమీదనే ఆగిపోయినా వీళ్ళు మాత్రం మెట్రిక్యులేషన్ వరకు చదవగలిగారు.

ఇద్దరూ మెట్రిక్యులేషన్‌తో చదువు ఆపినా పట్టణానికి వారి రాకపోకలు ఆగలేదు. మా స్నేహానికి ఎలాంటి బీటలూ పడలేదు. నేను ఆ పట్టణంలోనే చదువు పూర్తి చేసుకొని అక్కడే ఉద్యోగస్థుడ్ని కావటంతో మేము తరచుగా కలుసు కుంటూనే వుండేవాళ్ళం.

పట్టణంలోనే పుట్టి పెరిగిన నాకు అప్పట్లో ఈ ఊరు చాలా అబ్బురంగా ఎంతో అందంగా కనపడింది. కనిపించని సంగీతం ఏదో ఎప్పుడూ వినపడు తున్నట్లుగా అనిపించింది. ఊరు రెండు చెరువుల మధ్య ఉండి నీటి వసతి బాగుండటంతో ఎప్పుడూ పైరు పచ్చ దనంతో కళకళలాడుతూ ఉంటుంది. ఊరిబయట వున్న కొండమీద కూర్చొని రెండు చెరువులు కలిసే దగ్గర సూర్యుడు అస్తమించే దృశ్యాన్ని చూసిన జ్ఞాపకం ఇప్పటికీ నా మనసులో నుంచి పోలేదు.

సారధి నాయనమ్మ కూడా బాగా గుర్తుంది. ఆమె గురించి నాకు ముందే తెలుసు. సారధి చాలాసార్లు చెప్పేవాడు. పిల్లలంటే ఆమెకు చాలా ఇష్టం. అనేక సార్లు వాడు చెప్తుండగా నేను ఊహించుకున్న దృశ్యంతో అక్కడ వున్న రెండు రోజులూ నేనూ ఒక పాత్రనయ్యాను.

చీకటిపడే వేళకి చుట్టుపక్కల పిల్లల్ని కేకవేసి పిలుస్తుందామె. ఆ పిలుపు వినపడిందంటే పిల్లలుకు పండగే. పళ్ళాలు పట్టుకుని ఆమె చుట్టూ చేరతారు.

ఆమె ఒక పళ్ళెం తీసికొని అందులో కొన్ని పచ్చిమిరపకాయలు, కొన్ని వెల్లుల్లి రెబ్బలు, చింతపండు, ఉప్పు పట్టుకొని కూర్చుంటుంది.

పొలంపని చేసిన బండబారిన ఆ చేతితో పచ్చి మిరపకాయలు, వెల్లుల్లి చిదిమి అందులో చింతపండు, ఉప్పు కలిపి పచ్చడి చేస్తుంది. ఆమె ఆ పచ్చడి చేసేలోపే పిల్లలకు నోట్లో నీరు ఊరుతుంటుంది. ఆమె మనసులోని అమృతం ఆ పచ్చడిలో కలుపుతుందేమో అది తింటున్నప్పుడు పిల్లల ముఖాలలో కొత్త జీవనం చేరినట్లు ఉంటుంది. అప్పుడప్పుడే తోడుకుంటున్న పెరుగు వేసి పిల్లలకు ముద్దలు పెట్టేది. అక్కడున్న ఆ రెండ్రోజులూ నేనూ ఆ అమృతాన్ని రుచి చూశాను. ఎప్పటికైనా మీ వూర్లో పొలం కొనుక్కుని ఇక్కడే వుండాలని వుంది అని చెప్పాను నన్ను బస్కెక్కించ డానికి వచ్చిన సారథి, రమణలతో. వాళ్ళ ఊరు నాకు నచ్చినందుకు ఇద్దరూ సంతోషించారు. ఆ ఊరి నుంచి, వారిద్దరి కుటుంబాల నుంచి ప్రేమ అనేక రూపాలతో నన్ను చేరుతూనే ఉండింది. ఆ తరువాత చాలాసార్లు వచ్చాను. సారధి పెళ్ళికి కూడా వచ్చాను. కోరుకున్న అమ్మాయితో పెళ్ళి

కుదరటంతో సారథి ముఖం వెలిగిపోతూ వుంది. ఆ పెళ్ళి సారథి కుటుంబానిది కాక ఊరిలో అందరి ఇంట్లో పెళ్ళిలాగా జరిగింది. పెళ్ళిరోజు ఊరివాళ్ళంతా పాలు,పెరుగు, కూరగాయాలు తెచ్చి ఇవ్వటం.. ఆ ఊరిలో వంట బాగా చేస్తారు అని పేరున్న వాళ్ళు వచ్చి వచ్చి వంట చెయ్యటం.. అన్ని పనులు అందరు పూనుకుని చెయ్యటం నాకు అబ్బురంగా ఉండింది. సామూహిక నృత్యంలోని బృందగానం నా చెవులకు చేరుతున్నట్టుగా ఉండింది. ఎంత సొగసు, సౌందర్యం వుంది ఈ జీవితంలో అనిపించింది.

కానీ ఇప్పుడు ఇన్నాళ్ల తరువాత మళ్ళీ అదే ఊరు, అదే మనుషులు, అదే ప్రశాంత. కాదు ఇది ప్రశాంతత కాదు, స్థబ్దత అలనిపిస్తోంది. అప్పటి భావాలన్నిటినీ ఎవరో హత్య చేసినట్టనిపిస్తుంది. వీళ్ళు జీవించటం లేదనీ కేవలం చచ్చేదాకా బతుకుతున్నారనీ అనిపిస్తోంది. తమలో వుండే చైతన్యపు వెలుగులను విరజిమ్మి దారి లేక, వాటిని తోటి వారి పట్ల అసూయాద్వేషాలుగా మార్చుకున్నట్టు తోస్తుంది.

"మామా ఇదుగో వేపుల్ల" రమణ కూతురి పిలుపుతో పుల్ల అందుకుని నోట్లో పెట్టాను. జ్ఞాపకాల ధార అలా కొనసాగుతూనే ఉంది.

.........

ఆ రోజు ఆఫీసులో కూర్చుని పని చేసుకుంటున్నాను. సారథి వచ్చాడని క్లర్క్ చెబితే బయటకి వచ్చానను. ఒకపూట సెలవు పెట్టి ఇద్దరం బయటకు వచ్చాము. రమణకి ఏదో పనిబడి రాలేకపోయాడని చెప్పాడు సారథి. అప్పుడప్పుడు ముగ్గురుం కలిసి అలా గడపటం బాగా అలవాట య్యింది. ఎక్కడో బిగించి కట్టుకున్న ముడులను వదులు చేసుకున్నట్టు అనిపిస్తుంది ఆ కాసేపు.

ఎందుకో సారథి దిగాలుగా వున్నాడు. ఏదో ఆలోచిస్తూ. "నాకు రెండో పెళ్ళి నిర్ణయం చేసారు", ఎటో చూస్తూ చెప్పాడు. ఇలాంటిదేదో జరుగుతుందని అనుకుం టూనే వున్నాను. పెళ్ళి అయి సంవత్సరాలు అయినా పిల్లలు పుట్టలేదని అందరూ అదోలా చూస్తున్నారని ఇంతకు ముందే చెప్పాడు.

'నువ్వేమన్నావు. నువ్వు కూడా మళ్ళీ పెళ్ళికి తయారయ్యావా?' వద్దు అనుకున్నా గొంతులో కొంచెం వెటకారం తొంగి చూసిందేమో. 'ఆ అమ్మాయిని ఎంత కోరుకుని చేసుకున్నావు. ఆ అమ్మాయిని ఏమి చేస్తావు. నీకు న్యాయం అనిపిస్తుందా? ఆమాత్రం ఇంట్లోవాళ్ళకి నచ్చజెప్పు కోలేవా...?

"నీకు తెలియదు మాధవా". నెమ్మదిగా మాటలు కూడదీసుకుంటూ చెప్పసాగాడు సారథి. "నువ్వు పట్టణంలో ఉంటున్నావు. నీకు సమాజం, సంఘం అంటే నీ చుట్టాలు, నీ ఇంటి చుట్టుపక్కల వుండే కొన్ని కుటుంబాలు, నీతో పనిచేసే ఉద్యోగస్థులు. వీళ్ళని ఎదుర్కోవటం, నచ్చచెప్పటం వినక పోతే వాళ్ళకి దూరంగా వుండటం చాలా సులభం. నా పరిస్థితి అదికాదే... నాకు సంఘం అంటే మా ఊరిలో వుండే ఐదువందల గడపలు... మూడువేల మంది జనాభా. వీళ్ళందరు అన్ని కుటుంబాలకు న్యాయనిర్ణేతలు. వారు నిర్దేశించినట్టుగా నడవక పోతే అక్కడ బతకలేము."

'ఇది జీవితానికి సంబంధించిన విషయం. వాళ్ళందరూ ఎవరు.... ఇంత చిన్న దాన్ని కూడా నువ్వు ఎదిరించలేవా' నాకు చాలా కోపంగా వుంది వాడిని చూస్తుంటుంటే.

"నా జీవితం నా చేతిలో ఏమీ వుండదు. ప్రవాహానికి ఎదురీదడం చాలా కష్టం. చీమైనా రోజు ఒకే దగ్గర కుడితే ఆ నొప్పిని భరించలేము. పెళ్ళి అయిన నెలనుంచే పిల్లలు అని మొదలుపెట్టారు. ఆరు నెలలకి రెండో పెళ్ళికి తయారు కమ్మన్నారు. ఇన్ని రోజులు నిలవరించాను. ఇంక నా శక్తీ అయిపోయింది."

మాటల ప్రవాహం సాగే మా మధ్య నిశ్శబ్ధం పొరలా పరుచుకుంది.

..........

సారథికి రెండో పెళ్ళి జరుగు తున్నప్పుడే అతని మొదటి భార్య బావిలో పడి ఆత్మహత్య చేసుకుందని చెప్పాడు రమణ తరువాత కలిసినప్పుడు, మనసంతా మెలిపెట్టినట్లయింది. పెళ్ళిలో చూసిన లేత సిగ్గు పరుచుకున్న ఆ అమ్మాయి ముఖం చాలా రోజులు నా కళ్ళముందు తిరుగు తూనే వుండింది. ఆ ఊరికి నాకు మళ్ళీ వెళ్ళాలనిపించలేదు. సారథి మీద పట్టరాని కోపం. వాడు కనబడితే "నువ్వు హంత కుడివి" అని తిట్టాలని వుండేది. అయితే

కొద్దిరోజులకి నన్ను కలవటానికి వచ్చిన వాడిని చూసి ఆ పని చెయ్యలేకపోయాను. సారథి ఆత్మ తొణికిసలాడే ఆ కళ్ళు వెలుగు ఆరిపోయినట్టుగా వున్నాయి.

నేను ఏమీ మాట్లాడలేకపోయాను.

....

సారథి నా దగ్గరకు రావటం తగ్గింది. వచ్చినా మనసు విప్పి మాట్లాడే వాడు కాదు. నేను కూడా అతని సొంత విషయాలు ఎత్తేవాడిని కాదు.

రమణ ద్వారా నాకు సారథి విషయలు తెలుస్తూ ఉండేవి. రెండో భార్యకు కూడా పిల్లలు పుట్టలేదని..... ఆమె బయట చేరినప్పుడల్లా దుడ్డు కర్ర తీసుకుని విపరీతంగా కొడుతున్నాడని తెలిసి బాధనడేవాడిని, ఇవన్నీ నాకు తెలిసినా ఎప్పుడూ ఇదేమని వాడిని అడగలేదు. అడిగే అవకాశం వాడూ నాకివ్వలేదు.

ఎలాంటి సారథి ఎలా అయిపోయాడా అని ఆలోచిస్తే బాధగా దిగులుగా వుండేది.

ఎంత సున్నితంగా ఉండేవాడు. చదువుకునే రోజుల్లో, చెట్టుకు కూడా జీవం ఉంటుందని క్లాసులో టీచర్ చెప్పినప్పటి నుంచీ చీకటి పడితే చెట్టుని ముట్టుకు నేవాడు కాదు. మేము ఆకు కొయ్యబోయినా అది నిద్రబోతుంది కొయ్యొద్దు అని వారించేవాడు. ఆడపిల్లల జీవితాలు వాడికి చెట్టు ఆకు కంటే తేలిక అయ్యాయా అనిపించేది.

........

"సారథీ! నువ్వేం చేస్తున్నావో నీకు తెలుస్తుందా? ఇంకో పెళ్లికి కూడా తయారుగా ఉన్నావనుకుంటా. రేయ్... నిజంగా నిన్ను చూస్తుంటే అసహ్యంగా ఉందిరా.." కోపం, అసహ్యంతో మా మధ్యనున్న నిశ్శబ్దపు గోడని బద్దలు చేస్తూ అడిగాను నన్ను కలిసిన సారథిని.

ఒక్కసారి తలెత్తి ఖాళీ కళ్ళతో నావైపు చూశాడు సారథి. ఆపుకోలేని దుఖంతో బద్దలయ్యాడు. యుగాలను నంచి గూడు కట్టుకున్న దుఖం, కన్నీరు వరదలై నన్ను ముంచెత్తింది.

"ఊరుకో రా" ఏం మాట్లాడాలో అర్థం కాలేదు నాకు. వాడితో వాడే మాట్లాడుతున్నాడో, కరిగి కన్నీరై ప్రవహించ సాగాడు. "నన్ను ఏం చెయ్యమంటావురా? న్నాకు ఇష్టమను కున్నావా ఇదంతా..? మొదటి దానికి పిల్లలు పుట్టకపోతే దానిదే లోపం అన్నారంతా. నేనూ అలాగే అను కున్నాను. అందరూ బలవంతం చేసారు. నాక్కూడా లోపల పిల్లలు కావాలనే కోరిక ఉండేమో నేనూ ఒప్పుకున్నాను. రెండో దానికి కూడా పిల్లలు పుట్టకపోతే నాపై నాకు అనుమానం వచ్చింది. అందరూ నన్ను అనుమానంగా చూస్తున్నారనిపించేది. నాలో లోపం లేదని ఎలా అయినా నిరూపించుకోవాలని అనిపించేది. ఏమి చెయ్యాలో నాకు తోచలేదు. ఇప్పుడు అందరూ నానకు వినబడేటట్టే నాలో మగతనం లేదని అనుకుంటున్నారు. రేయ్.... నా చిన్నప్పుడు జరిగిన ఒక సంగతి గుర్తకొస్తుందిరా. బయట బజార్లో ఆడుకుంటున్నాను. అంతలో ఏదో పెద్ద చప్పుడు. విపరీతమైన భయం వేసింది. ఆ

**"అనగనగ ఒక ఎలుక వుండేదంట. ఆ ఎలుకకి నాలుగు తోకలంట. అందరూ నాలుగు తోకల ఎలుక అని ఎక్కిరిస్తుంటే ఒక తోక కత్తిరించుకుందంట. అప్పుడు అందరూ మూడు తోకల ఎలుక అన్నా రంట. ఇంకో తోక కత్తిరించుకుందంట. అప్పుడు రెండుతోకల ఎలుక అన్నారంట. ఇంకోతోక కూడా కత్తిరించుకుందంట. అప్పుడు అందరూ తోకలేని ఎలుక.. తోకలేని ఎలుక అన్నారంట. హహ"**

చప్పుడు వస్తున్న వైపు చూసాను. ఏదో పెద్ద జంతువు నన్ను తినటానికి వస్తుందను కున్నాను. వెర్రికేక పెట్టాను. అక్కడ అరుగుమీద కూర్చుని వున్న వాళ్ళలో ఎవరైనా వచ్చి నన్ను రక్షిస్తే బాగుండను కున్నాను. కాని ఎవరూ రాలేదు. రాక పోగా " ఏందిరా ఆడపిల్లలాగా ట్రాక్టర్ని చూసి భయపడతావు. మొగాడంటే ఎట్టుండాల" అని ఎగతాళి చేశారు.

ఇప్పుడు కూడా అలాగే నన్ను ఎగతాళి చేస్తున్నారా.

నాగలి సాలు అందరికంటే నేను బాగా వేస్తాను. పంట అందరికంటే నేనే ఎక్కువ పండిస్తాను. కోలాటం మెయ్యటంలో నన్ను మించిన వాళ్ళు లేరు. ఐనా ఇవన్నీ లెక్కలోకి రావంట. పిల్లల్ని పుట్టించలేదు గాబట్టి నేను మొగోడ్ని కాదంట. నువ్వు చెప్పరా. నేను మగాడ్ని కాదా? నాకు చాలా అవమానంగా అనిపిస్తుందిరా.

అవన్నీ పట్టించుకోవద్దు, ఆ వాగుళ్ళని లెక్క చేయ్యొద్దు అని నువ్వు చెప్తావు. కాని అది అంత సులభం కాదు. అనుభవించే

వారికే తెలుస్తుంది." ఏడుస్తూనే వెళ్ళిపోయాడు సారథి. నేను చేష్టలుడిగి అలా నిల్చుండిపోయాను.

.........

"నాన్నా కథ చెప్పేదా" రమణ కూతురు గారాబంగా అడిగింది.

"కథలేదు ఏమీ లేదు. నువ్వుపో" విసుక్కున్నాడు.

'నాకు చెప్పు'

కొద్దిగా సిగ్గుపడింది. కథ చెప్ప సాగింది.

"అనగనగ ఒక ఎలుక వుండేదంట. ఆ ఎలుకకి నాలుగు తోకలంట. అందరూ నాలుగు తోకల ఎలుక అని ఎక్కిరిస్తుంటే ఒక తోక కత్తిరించుకుందంట. అప్పుడు అందరూ మూడు తోకల ఎలుక అన్నారంట. ఇంకో తోక కత్తిరించుకుందట. అప్పుడు రెండుతోకల ఎలుక అన్నారంట. ఇంకో తోక కూడా కత్తిరించుకుందంట. అప్పుడు అందరూ తోకలేని ఎలుక.. తోకలేని ఎలుక అన్నారంట. హహ" చిలకలాగా నవ్వుతుంది. ఆ పాప.

.........

"ఎలా జరిగింది. ఎప్పుడు జరిగింది" చెప్పిన వెంటనే నా నోట మాట రాలేదు. ఇదేంటీ..... ఇంత అన్యాయమా. మొన్నీ మధ్యే కదా సారథి తండ్రి కాబోతున్నాడని విని వాడి కష్టాలు తీరుతున్నాయని సంతోష పడింది. ఇంతలోనే ఇలా జరిగిందా...

"నీకు కబురు పంపాము. నువ్వు కాంపుకి వెళ్ళావని చెప్పారు. టెలిగ్రామ్ పంపినా నీకు చేరేసరికి అంతా అయిపోతుందని పంపలేదు. నువ్వు ఇవాళ వస్తావని తెలిసి నేనే వచ్చాను". రమణ ముఖం దుఖంతో నిండివుంది.



"ఏమైంది అసలు" నెమ్మదిగా కూడతీసుకుని అడిగాను. శూన్యంలోకి చూస్తూ చెబుతున్నాడు రమణ.

"నాకు అందరు అనుకునేదే తెలుసు. వాడు నా దగ్గర కంటే నీ దగ్గరే ఎక్కువ చెప్పుకునేవాడు. వీడి దెబ్బలకు భయపడిందో, లేక వీడి ప్రోద్భలమే వుందో ఆ పిల్ల గర్భం దాల్చింది. సారథి వల్ల కాదని, పాలేరు వల్ల అనీ ఊరంతా గుప్పుమంది. వీడికి తెలిసే జరిగింది అని అందరూ అనుకుంటున్నారు. ఇవన్నీ వాడి చెవిన బడ్డా వినీ విననట్టు ఊరుకున్నాడు. ఆ రోజు అలా జరక్కపోతే వాడు కూడా ఇంత అఘాయిత్యం చేసి వుండే వాడు కాదను కుంటాను".

ఆ రోజుటి దృశ్యం కళ్ళముందు కనబడుతున్నట్టు వుంది.

"బార్నీల దగ్గర పచ్చాకు కట్టలు కడుతున్నారు. చాలామంది పక్క ఊర్లనుంచి కూడా ఆ పనికి వస్తారు. సారథి ఆ దారిలో వచ్చాడు. నేను కూడా అప్పుడు అక్కడే వున్నాను. ఏరా సారథా.. నీ కులపోళ్ళం వట్టిపోయామంటావా, నీ పెళ్ళాంతో పాలేరుకు కొంగు పరిపిచ్చావు. సర్లే రెండో విడతకాన్న మాకియ్యి" అన్నారు. సారథి నివ్వెరపోయాడు. ఏమీ మాట్లాడలేదు. వడివడిగా అక్కడనుంచి వెళ్ళాడు. నేను పిలుస్తున్నా వినిపించుకోలేదు. ఎవరితో మాట్లాడలేదు. అందరూ పడుకున్న తరువాత ఉరిపోసుకున్నాడు.

........

"మామని బసు ఎక్కించి వస్తాను. నువ్ ఇంటికి పో" కూతురితో చెప్పి బయలుదేరాడు రమణ.

ఎవర్రా రమణా, మాధవుడా, దినానికి వచ్చాడా" ఎవరో అడుగుతున్నారు.

"మామా ఎలుకని' తోకలేని ఎలుక" అని పిలవద్దని చెప్పు మామా" రమణ కూతురు నా చెవిలో అరుస్తుంది. "ఎన్ని తోకలు వుంచుకుంటే నన్ను ఎగతాళి చెయ్యకుండా వుంటారు" తోకలేని ఎలుక నన్ను నిలదీస్తుంది.

"నేను మొగవాడిని అనిపించుకోవాలంటే ఇంకా ఏమేమి చెయ్యాలో కొంచెం కనుక్కుని చెప్పరా" సారథి బ్రతిమిలాడుకుంటన్నాడు. "ఏందిరా ఆడపిల్లలాగ భయపడతావు. మొగోడంటే ఎట్టుండాలా" ఎవరో అరుస్తున్నారు. ముక్కలు ముక్కలైన సీతాకోక చిలక రెక్కలు నా కళ్ళముందు ఎగురుతున్నాయి.

వ్యాసం

# విద్యార్థుల్లో హింసాప్రవృత్తి పెరగటానికి బాధ్యులు ఎవరు

- పసుపులేటి రమాదేవి



హైదరాబాద్ నగరంలో అమానవీయ ఘటన చోటు చేసుకున్నది. ముగ్గురు బాలురు చిన్న కుక్క పిల్లలను అతి దారుణంగా మంటల్లో వేసి కాల్చి చంపడమే కాదు, దాన్ని వీడియో తీసి ఫేస్ బుక్‌లో పెట్టారు. మంటల్లో చిక్కుకుని విలవిలలాడిన ఆ కుక్క పిల్లలు బయటకు పరుగెత్తుకు వస్తుంటే, వాటిని కర్రలతో లాగి మరీ మంటల్లోకి తోయటం జరిగింది. ఈ విషయం చదువుతుంటేనే మనసు చలించి పోయింది. అసలు చిన్న కుక్క పిల్లలు కనబడితే ముద్దుగా ప్రేమతో వాటిని ఇంటికి తీసుకువచ్చే పిల్లలను చూశాను కానీ ఈ రకంగా హింసించడం అంటే మనం దీని పట్ల తీవ్రవంగా ఆలోచించాలి. ఇలా ఎందుకు జరుగుతుంది?

విద్య పేరుతో పిల్లల మీద ఒత్తిడి పెరిగింది. స్టడీ అవర్స్ పేరిట పాఠశాల భోధనా సమయం అయిపోయిన తరువాత కూడా విరామం లేకుండా చదివిస్తున్నారు. ఏ 8గం॥లకో, తొమ్మిది గం॥లకో అలసిపోయి ఇళ్ళు చేరుతున్నారు. మళ్ళీ ఉదయం 7 గం॥లకో, 7-30 గంటలకో స్కూల్ బస్సో, ఆటోనో, వాన్ లాంటిదో ఎక్కి స్కూల్‌కి బయలుదేర వలసి వస్తుంది.

ఆ విద్యార్థికి ఇంట్లోగాని ఇంటి చుట్టు పక్కల గాని ఏమి జరుగుతుందో తెలుసుకొనే అవకాశం లేకుండా పోయింది. కనీసం వాళ్ళ పెరటిలో ఉన్న మొక్కలకు పూసిన పూలను, పండ్లను కూడా చూసి ఆనందించే సమయం కూడా ఉండటం లేదు.

పిల్లలకు చిన్నప్పుడు నుండే ఐఐటి కోచింగ్, సివిల్స్ కోచింగ్ అని వారిని విపరీతంగా మానసికంగా హింసించటం జరుగుతుంది. తల్లి దండ్రులు కూడా ఇంకా కొంచెం ఎక్కువ డబ్బులు కట్టించుకుని అయినా పిల్లలను ఏ స్కూల్లో అయితే స్టడీ అవర్స్ పేరుతో ఎక్కువ సేపు వుంచుకుంటారో అలాంటి స్కూల్స్‌లోనే పిల్లలను చేర్పించటం జరుగుతుంది.

చాలామంది పేరెంట్స్ చెప్పేది ఏమిటంటే మా పిల్లలు ఇంటికి వస్తే మా మాట వినరు కాబట్టి మీ దగ్గరే ఉంచుకొని చదివించండి అని చెప్పటం జరుగుతుంది.

10వ తరగతి, ఇంటర్ స్థాయికి వచ్చినప్పటి నుండి ఆదివారాలు, పండుగరోజులలో కూడా స్టడీ ఆవర్స్ అని, వీకెండ్ టెస్ట్‌లని స్కూల్స్‌కి, కాలేజీలకి వెళ్ళటం జరుగుతుంది. కార్పొరేట్ కాలేజీలలో అయితే సిలబస్ మొత్తం గబగబా అవగొట్టడం, పరీక్షలు పెట్టటం జరుగుతుంది. ఆ పరీక్షలలో మార్కులు తగ్గితే పేరెంట్స్‌ని పిలిపించి పిల్లలను దోషులుగా నిలబెట్టి మాట్లాడటం జరుగుతుంది.

అప్పుడు కూడా అక్కడ ఉండే అధ్యాపకులు చెప్పేది ఏమిటి అంటే మీ పిల్లలు రాత్రికి ఇంటికి వచ్చిన తరువాత కూడా న్యూస్ పేపర్ అది చదవనీయ కుండా ఆటైమ్‌లో కూడా ఎమ్ సెట్ బిట్స్ చేయించండి అని చెపుతారు. ఆ వయసులో పేపరు కూడా చదవకుండా సమాజంలో ఏమి జరుగుతందో తెలుసు కోకుండా వాళ్ళు ర్యాంకులు తెచ్చుకుని ఎవరికి ఉపయోగ పడాలి ఇటు తల్లిదండ్రులకి, అటు సమాజానికి, చివరికి వారికి వారే ఉపయోగపడలేని దశలో ఉంటున్నారు.

పిల్లలు మానసికంగా ఉల్లాసం పొందానికి మన స్కూల్స్‌లో కాని, కాలేజీలలోగాని ఆటస్థలాలు ఉండవు. సరయిన లైబ్రరీలు ఉండవు. లాబ్స్ ఉండవు, కనీసం గాలి వెలుతురు కూడా సరిగా రాని స్కూల్స్, కాలేజీలే ఎక్కువగా ఉన్నాయి.

ఇంకొక విచిత్రమైన విషయం ఏమిటంటే ఎల్‌కేజీ పిల్లలను కూడా స్కూల్ నుండి రాగేనే ట్యూషన్‌కి పంపిస్తారు. అలా పంపించే వారిని ఎందుకండీ చిన్న పిల్లల్ని స్కూల్ నుండి రాగానే ట్యూషన్‌కి పంపిస్తారు. కాసేపు హాయిగా ఆడుకోని వ్వండి, తరువాత మీరు కూర్చోబెట్టుకుని

**పిల్లలు రాత్రికి ఇంటికి వచ్చిన తరువాత కూడా న్యూస్ పేపర్ అది చదవనీయకుండా ఆటైమ్‌లో కూడా ఎమ్ సెట్ బిట్స్ చేయించండి అని చెపుతారు. ఆ వయసులో పేపరు కూడా చదవకుండా సమాజంలో ఏమి జరుగుతందో తెలుసుకోకుండా వాళ్ళు ర్యాంకులు తెచ్చుకుని ఎవరికి ఉపయోగ పడాలి ఇటు తల్లిదండ్రులకి, అటు సమాజానికి, చివరికి వారికి వారే ఉపయోగపడలేని దశలో ఉంటున్నారు.**

కొంచెం సేపు చదివించుకోవచ్చు గదా అంటే లేదండి మా మాట వినరు. ఇంట్లో వుంటే అల్లరి చేస్తారు అంటారు. ఆ వయసులో పిల్లలు ఇంట్లో అల్లరి చేయకపోతే మరి ఇంకెక్కడ?

అసలు ఆ వయసులో పిల్లలు గొడవ చేసి అల్లరి చేయకపోతేనే ఆలోచించాలి అని డాక్టర్లు చెపుతారు.

**అసలు ఒక చిన్న విషయం:** మనము రోజు కిచెన్‌లో వాడుకొనే మిక్సీ అది ఏ బ్రాండ్ కంపెనీది అయినా కావచ్చు మనము అందులో వేయాల్సిన లిమిట్ కంటే ఎక్కువ లోడ్ వేసి పని చేయిస్తే అది తిరగకుండా స్టక్ అయిపోతుంది. మళ్ళీ మనము మిక్సీని కాసేపు ఆఫ్‌లో పెట్టి, మిక్సీ కింద వున్న రెడ్ బటన్ నొక్కితే గాని మళ్ళీ మిక్సీ పని చేయదు.

చిన్న మిషన్‌కే ఆ పరిస్థితి వుంటే మన భావి భారతపౌరులను విద్య పేరుతో వారిని మానసికంగా ఎంత హింస పెట్టి వారి మెదళ్ళు మొద్దుబారి పనిచేయకుండా చేస్తున్నామో ఒకసారి ఆలోచించుకోవాలి.

దీనికి తోడు ఈ రకంగా బాగా మానసికంగా అలసిపోయి ఇంటికి వచ్చిన తరువాత ఎక్కువ మంది పిల్లలు చేసేది ఏమిటి అంటే టెక్నాలజీ బాగా పెరిగిపోయింది గదా! అందుకని కంప్యూటర్ గేమ్స్, వీడియో గేమ్స్, సెల్‌ఫోన్‌లో గేమ్స్‌తో కాలం గడుపుతుంటారు. పెద్దవారు కూడా దొరికిన కాస్తటైమ్‌ని ఫేస్‌బుక్, వాట్సప్‌లకి ,టీవీలలో జీడిపాకంలా సాగిపోయే పనికి రాని సీరియల్స్‌కే టైమ్ కేటాయిస్తున్నారు. ఆ సీరియల్స్ నిండా భయంకరమైన శబ్దాలు, మ్యూజిక్‌లు, అసహజ వేష ధారణ, వెరసి మొత్తం ఆ సీరియల్స్ నిండా హింసే ఎక్కువగా చూపిస్తారు. అవి కూడా పిల్లల మీద చాలా చెడు ప్రభావం చూపిస్తున్నాయి. ఈ రకంగా మన బాలలు అందమైన, అమూల్యమైన వారి బాల్యాన్ని కోల్పోతున్నారు. బాల కార్మికులు కేవలం శారీరకంగానే అలసిపోతున్నారు. కాని ఈ రకంగా స్కూల్స్‌కి, కాలేజీలకి వెళ్ళే పిల్లలు మానసికంగా, శారీరకంగా విపరీతమైన హింసకు గురి అవుతూ హింసా ప్రవృత్తిని పెంచుకుంటున్నారు.

సంతోషముగా ఉదయం స్కూల్‌కి వెళ్ళిన పిల్లలు సాయంత్రం 3, 4 గంటలు కాగానే ఇంటికి ఎప్పుడు వెళదామా అని ఎదురు చూస్తుం టారు. అప్పటికి వారి శక్తి సామర్థ్యాలు సన్నగిల్లుతాయి, మళ్ళీ ఇంటికి వచ్చి స్నానం చేసి, ఫ్రెష్ అయి, ఏదోఒకటి తిని, కాస్త బయట చల్లగాలికి ఆడుకొని, ఇంట్లో వారితో స్కూల్‌లో జరిగిన సంగతులు పంచుకొని, ఉల్లాసం పొందిన తరువాత కూర్చొని చదువుకుంటే వారికి చదివినది కూడా బాగా గ్రహింపు చేసుకోగలుగుతారు.

తల్లిదండ్రులు కూడా తమ పిల్లలతోటి సాధ్యమైనంత ఎక్కువ సమయం మాట్లాడి వారి మనసులోని ఆలోచనలను, అలాగే స్కూల్‌లో జరిగిన విషయాలను పంచుకోగలగాలి.

"పిల్లల కోసం ఆస్తులు పెంచకండి!
పిల్లలనే ఆస్తులుగా పెంచండి".

ముఖ్యంగా ప్రభుత్వం వారు స్కూల్స్, కాలేజీలు ఎన్ని గంటలు పనిచేయాలి అనే దానిమీద ఒక నియంత్రణ ఉండాలి. ప్రతి స్కూల్‌లో, కాలేజీలలో గాలి, వెలుతురు, ఆటస్థలాలు, లైబ్రరీలు, ల్యాబ్స్ ఉండాలి. నైపుణ్యము పొందిన ఉపాధ్యాయులు, తప్పనిసరిగా ప్రతి స్కూల్‌లో, కాలేజీలో పిల్లల సైకాలజీ చదివి అనుభవమున్న వారిని కౌన్సిలర్‌లుగా నియమించి వారితో పర్యవేక్షణ జరిపి వారి చేత పిల్లలకి కౌన్సిలింగ్ ఇప్పించి అవసరమైతే వారి తల్లిదండ్రులకు కూడా కౌన్సిలింగ్ ఇప్పించాలి.

తల్లిదండ్రులు కూడా తమ పిల్లలు కేవలం మార్కుల కోసం, ర్యాంకుల కోసమే కాదు విద్య నేర్చుకునేది, విజ్ఞానం పెంచుకోవటానికి, మనిషిగా ఎదగడానికి అన్న సత్యాన్ని గుర్తించాలి. అలాగే ప్రభుత్వము, తల్లిదండ్రులు, ఉపాధ్యాయులు, సభ్య సమాజము బాధ్యత వహించి పిల్లలలో దాగి వున్న సృజనాత్మకత శక్తిని బయటకు తీసుకువచ్చి వారు సృజనాత్మ కంగా ఆలోచించగలిగే అవకాశము కల్పించాలి. మనస్ఫూర్తిగా అందరూ అందుకోసం కృషిచేయాలి.



# కేస్ స్టడీ

**- కె. అనురాధ**

ఫ్యూడల్ అవశేషాల ముసుగులో సమిధలవుతున్న మహిళల బ్రతుకులకు సజీవ సాక్ష్యం శిరీష కథనం.

2005 సం॥లో 10వ తరగతి చదువుతున్న మైనర్ బాలిక శిరీష అన అమ్మ తమ్ముడైన మేనమామ శ్రీనివాసుతో పెళ్ళి జరిగింది. మేనరికం వివాహాలు చేయడం సరికాదు అని సైన్స్ చెబుతున్నా మూర్ఖంగా "అభిమానాల" పేరుతో ఆస్థులు బైటికి పోతాయి అనే భయంతో ఇలాంటి వివాహాలు నేటికి జరుగుతున్నాయి.

పెళ్ళి అయినప్పటి నుండి శిరీష తన భర్తతో అనేక ఇబ్బందులు పడుతూ వచ్చింది. అమ్మాయిల వెంటపడి చెడు తిరుగుళ్ళకు అలవాటు పడ్డ భర్త శ్రీనివాస్ శిరీషకు తన ప్రేమ అభిమానాలు పంచలేకపోయాడు. నాలుగు సంవత్సరాల దాంపత్య జీవితంలో శిరీషకు ఇద్దరు ఆడపిల్లలు పుట్టారు. శ్రీనివాస్‌కు చెడు తిరుగుళ్ళ ఫలితంగా హెచ్ఐవి సోకింది. అది తెలుసుకున్న శ్రీనివాస్ భార్య, ఇద్దరు ఆడపిల్లలతో సహా హాస్పటల్‌కు తీసుకెళ్ళి వైద్య పరీక్షలు చేయించాడు. ఇప్పుడు ఎందుకు వైద్య పరీక్షలు అని శిరీష అడగగా "మెడికల్ సర్టిఫికెట్" కోసం అని అబద్ధం చెప్పాడు. మెడికల్ రిపోర్టును కూడా శిరీషకు చూపించ కుండా భద్రపరిచాడు. దానితో శిరీషకు అనుమానం వచ్చి భర్త ఇంట్లో లేని సమయంలో రిపోర్టును వెదికి పరిశీలించగా శిరీషకు, పిల్లలకు మెచ్ఐవి లేదు. భర్త శ్రీనివాస్‌కు హెచ్ఐవి ఉన్నట్లుగా తెలుసుకుంది. ఆందోళన చెందిన శిరీష తల్లిదండ్రులకి ఈవిషయం తెలియ జేసింది. తన భర్త శ్రీనివాస్‌తో దాంపత్య జీవితం చేస్తే తాను కూడా హెచ్ఐవి బారిన పడతాను అని, తన ఇద్దరు పిల్లలు అనా థలు అవుతారు అని తాను వేరుగా ఉంటానని, భర్తతో కాపురం చేయలేనని చెప్పింది. కాని ఈ విషయం బయటకు తెలిస్తే కుటుంబ పరువు పోతుందని తన భర్తతోనే కలిసి ఉండాలని కుటుంబసభ్యులు బలవంతం పెట్టారు. ఇంక లాభం లేదని ఊరు పెద్ద అయిన తన తాతగారితకి ఈ విషయం తెలియజేసింది.

ఈ విషయం తెలునుకున్న తల్లిదండ్రులు, తమ్ముడు శిరీషకు ఎటువంటి తిండి పెట్టక గదిలో బంధించారు. ఎట్టకేలకు శిరీష స్థానిక ఐద్వా నాయకుల సాయంతో "శారద ఉచిత న్యాయ సలహా కేంద్రాన్ని" ఆశ్రయించింది. ట్రస్టు సహకారంతో బట్టలు కుట్టు కుంటూ వర్కింగ్ ఉమెన్ హాస్టల్‌లో జీవనం గడుపుతుంది. ట్రస్టు నాయకులు పలుమార్లు శిరీష భర్త, తల్లిదండ్రులతో చర్చలు జరిపినా పరువు పరువు అంటూ మూర్ఖత్వంగా ప్రవరిస్తున్నారు. ఎట్టి పరిస్థితులలోను తనభర్తతోనే కలిసి ఉండాలని పట్టుబడు తున్నారు.

శిరీష న్యాయమైన కోర్కెలు తన పిల్లలకు భర్త ఆస్థిలో కొంత భాగం రాసి ఇస్తే తన ఇద్దరు పిల్లలతో తాను కలిసి జీవిస్తాను అని చెప్పింది. పిల్లలను తల్లి వద్దకు వెళ్ళనీయకుండా "వస్తే కాపు రానికిరా! లేకుంటే లేదు" అని శిరీషను లొంగదాసుకోవడానికి ప్రయత్ని స్తున్నారు. కాని శిరీష లొంగలేదు.

న్యాయ పరమైన తన హక్కుల కోసం కోర్టులో కేసు వేసి న్యాయపోరాటం చేస్తున్నది. "శారదా ఉచిత న్యాయ సలహా కేంద్రం" శిరీషకు అండగా నిలబడింది. ఫ్యూడల్ భావజాలంతో మునిగి తేలుతున్న ఈ సమాజంలో లక్షలమంది మహిళల బ్రతుకులు బలైపోతున్నాయి. ఫ్యూడల్ భావజాలం నుండి బయటపడి న్యాయమైన తన హక్కుల కోసం పోరాడే ప్రతి మహిళకూ "ఐద్వా" మరియు శారదా ఉచిత న్యాయసలహా కేంద్రం వెన్నుదన్నుగా నిలబడుతున్నాయి.

# ప్రేమతో కామేశ్వరికి



- చలం

చిన్నప్పుడు తెనాలిలో మా అమ్మ ఓ పెళ్ళికి పిల్లలతో బైలుదేరుతోంది. అర్ధరాత్రి రైళ్ళు ఆ రోజుల్లో ఆ సంతోషంలో నిద్రపోయాను. చప్పుడై మెలుకువ వచ్చింది. బళ్ళు వచ్చాయి. ట్రంకులు బళ్ళల్లో పెడుతున్నారు. పరిగెత్తికెళ్ళి బండి ఎక్కాను. ఎంతసేపటికి బండి కదలదు. మా అమ్మ రాలేదు. విసుక్కుంటూ మా అమ్మ గదిలోకి పరిగెత్తాను. కన్నీళ్ళతో మంచంమీద కూచుని వుంది. నా హడావుడిలో నేను ఏం చూడక "ఇంకా రావేం? రైలు టైమయింది" అన్నాను. "వెళ్ళటం లేదు" అంది "వెళ్ళటం లేదా? అని బోరుమని ఏడ్చాను. మా నాన్న నాలుగు తన్ని పడుకోమన్నారు నన్ను.

తరువాత తెలిసింది ఉత్త తన అధికారం చూపుకోవటానికి ఆయన ఆ ప్రయాణం ఆపినట్టు. ఇట్లాంటి అధికారాలు కొన్ని రూపాలు. ముఖ్యం తన్నుల రూపాన. నామీదికి రాగానే, ఆయనను 'నాన్నా' అని పిలువలేదు నేను. జీవితమంతా మొహాన్ని తప్పుకు తిరిగాను. ఈనాటికీ ఆయన థాట్ ని భరించలేను. పిల్లలకి ఓనాటికి విడుదల వుంది తల్లిదండ్రుల అధికారం నుంచి, కానీ భార్యలకి ఎన్నడూ విముక్తి లేదు. నేనా రాత్రి అయినట్టు అయివుంటావు నీవు అనుకుంటు న్నాను. మీ భర్తగారు చాలా యాంబీషియస్ మాన్ లాగున్నారు. కాకపోతే కొంత హెల్ప్‌లెస్ అయి ఇట్లా తయారయ్యారేమో? మీ ఇద్దరి ఫ్యూచర్ ఎట్లా వుండబోతోందా అని యోచించుకుంటున్నాను.

"ఈ జన్మలో ఆ చలాన్ని నువ్వు చూడటానికి వీల్లేదు" అన్న భర్తను చూసి నాకు గౌరవం తగ్గదు. కానీ... ప్రేమని, గౌరవాన్ని పోగొట్టుకుంటారు. తమకి ఉపయోగపడింది... నానా చోట్లకి మనుష్యుల దగ్గరికి తిప్పుతారు. పరదేశాలకి పంపుతారు. ఫ్యాషన్ కోసం ఎటువంటి నీచులతోనైనా మిక్స్ కానిస్తారు. కాని చలం కాలి, బూడిదైనా ఆ తగలపెట్టిన ఊరి వైపుకి పోనీరు. కానీ, నీ భర్త అడ్డుపట్టారంటే నాకేం ఆశ్చర్యంగా లేదు. ఈనాడు ఆడవాళ్ళ మీది ఆశలు ఎక్కువైనాయి. చదివించి ఉద్యోగాలలో, సంగీతాలు, డ్యాన్సెస్ చెప్పించి, సినిమాలు- ఎట్లాగో తమ పిల్లని పైకి నెట్టుతారు. సుఖపడాలని. ఈ ప్రాసెస్‌లో పిల్ల వళ్ళూ, మనసూ, కారెక్టర్ ఏమైపోతున్నా యనేది అఖ్ఖరలేదు. సక్సెస్, మనీ, యాంబిషన్- తల్లిదండ్రులు, భర్తలు, అన్నలు, తాతలు- అందరికీ ఈ రోగం పుట్టింది.

ఎందుకీ ఘోష... 40 ఏళ్ళుగా గోలపెట్టాను. చేతులకి అందక, సుకుమారమైన హృదయాలు నాశనమౌతుంటే హెల్ప్‌లెస్‌గా చూస్తానుంచున్నాను. ఇక్కడికి వచ్చినా నా వేపు చేతులు జాచిన చేతుల కీళ్ళు విరుగుతున్నాయి.

స్టేటస్‌లో మాత్రం- ఇండియన్

మారిపోయిందండి ఈ లోకం. మీరు కన్న కలలు ఈనాడు దేశంలో వాస్తవమైనాయి. విద్యలో సంస్కరణలు, పిల్లల్ని కష్టపెట్టని బళ్ళు -ఇట్లా మాట్లాడతారు

**ఈనాడు ఆడవాళ్ళ మీది ఆశలు ఎక్కువైనాయి. చదివించి ఉద్యోగా లలో, డ్యాన్సెస్ చెప్పించి సంగీతాలు, సినిమాలు- ఎట్లాగో తమ పిల్లని పైకి నెట్టుతారు. సుఖపడాలని. ఈ ప్రాసెస్‌లో పిల్ల వళ్ళూ, మనసూ, కారెక్టర్ ఏమై పోతున్నాయనేది అఖ్ఖర లేదు. సక్సెస్, మనీ, యాంబిషన్- తల్లిదండ్రులు, భర్తలు, అన్నలు, తాతలు- అందరికీ ఈ రోగం పుట్టింది.**

ఈనాటి యువకులు. ప్రతిదీ అబద్ధమని ప్రతి నిమిషం తెలుస్తా వుంటుంది... నువ్వు రాలేదని పెద్ద షాక్ కాదు. చలం విషయం పోనీ, కానీ జీవితంలో నీచపడకు. అధికారానికి దాస్యం చేయకు. ఆత్మని అప్పజెప్పకు. ప్రేమ గొంతుకోసుకోకు. నీ లాసెస్‌ని చూసుకుని జంకకు. జీవితానికి లొంగి జీవచ్ఛవం కావడం కన్నా సంపూర్ణంగా నాశనమవడం నయం. నేను పదే పదే రాస్తున్నాను కదూ.. నవీన స్త్రీ తనని తాను నిత్యమూ అమ్ముకుంటోందని.

ఈశ్వరాశీర్వాదాలతో.....

# వివక్షతలోనూ విజయాన్ని సాధించిన క్రీడాకారిణులు

- బి. హెచ్. స్వర్ణలక్ష్మి

పురుషాధిక్య భావజాలం వలన ఆడశిశువు పట్ల ఉదాసీనత గర్భస్థ దశ నుండి తల్లిపైన ఒత్తిడి వారి జననంలోను, జన్మించిన పెంపకంపైన ప్రతిఫలించి వారిని మానసికంగానూ, శారీరకంగానూ కుంగదీసి అసమానత్వాన్ని కొనసాగిస్తుంది. కానీ ఈఅసమానతలను అధిగమించి ఆడపిల్లలే 2016 రియో ఒలంపిక్స్‌లో భారత జాతీయ పతాకాన్ని రెపరెపలాడించారు.

భారతదేశ సమాజంలోని తల్లిదండ్రులకు క్రీడారంగం అంటేనే చిన్నచూపు. ఎక్కువమంది మూసపద్ధతిలోనే ఆలోచిస్తూ పిల్లల ఆలోచనా విధానానికి సరైన మద్దతు ఇవ్వలేక వారి భవిష్యత్తును పాడుచేస్తున్నారు. ఈ ఆటలు 'కూడుపెడతాయా, గూడునిస్తాయా' శుభ్రంగా చదువుకోక అని పిల్లల ఆశలపై నీళ్ళు చల్లే వారే ఎక్కువ అంటే అతిశయోక్తి కాదు! ఇక పురుషాధిక్య సమాజంలో అమ్మాయిలకు క్రీడల్లో ప్రోత్సహించడమంటే పగటి కలే! ఇటువంటి పరిస్థితుల్లో కూడా మహిళలే ఈ దేశానికి ఆధారం అయ్యారనే విషయం రియో ఒలంపిక్స్ చెబుతున్నాయి.

**పి.వి సింధు:** సింధు 6 సం॥ల నుండే బ్యాట్



పట్టింది. తనకున్న క్రమ శిక్షణ, పట్టుదల, అచంచల విశ్వాసంతో తన కలను సాకారం చేసుకుంది. బ్యాడ్‌మెంటన్‌లో రియో ఒలంపిక్స్‌లో రజత పతకం సాధించి రియో క్రీడా గ్రామంలో భారత జెండాను రెపరెప లాడించింది. వాలీబాల్ క్రీడాకారులు పి.వి.రమణ, విజయల ముద్దుబిడ్డ సింధు.

**సాక్షి మాలిక్** : ఢిల్లీలో రైల్వే గెజిటెడ్ ఆఫీసర్, రోహతక్



యూనివర్శిటీ రెజ్లింగ్ డైరెక్టరుగా సాక్షి పనిచేస్తున్నారు. తండ్రి సుఖ్‌బీర్ బస్ కండక్టర్ తల్లి సుధేశ్ అంగన్‌వాడీ సూపర్‌వైజర్. తాతగారు బద్లూరాం మల్లయుద్ధ వీరుడు. ఆ ప్రభావమే సాక్షిమాలిక్‌ను 11 సంవత్సరాలకే ఆటలపట్ల మక్కువను లక్ష్యంగా తీసుకొనేలా చేసింది. పురుషాధిక్య భావజాలం ఎక్కువగా ఉన్న హర్యానా రాష్ట్రంలో రోహతక్ జిల్లా, మోఖ్రా గ్రామం ఈమె ఊరు. మల్లయుద్ధం ఆడవాళ్ళ ఆటకాదంటూ

నిరసించారు. మల్లయుద్ధం క్రీడ ఆడటానికి ముందుగా ఊరివారి విమర్శలు, కట్టుబాట్లు, తిరస్కారాలు, హేళనలు మొదలగువాటిపై ముందుగా యుద్ధం చేసింది. ఒలంపిక్స్ పతక వేటలో భారత్ ఆశలు అడుగంటుతున్న వేళ లేదు లేదు నేనున్నానంటూ దేశ ప్రజల ఆశలకు ఊపిరిలూదింది. కాంశ్య పతకాన్ని తెచ్చింది. ఓఖ్రా గ్రామమే ఈనాడు సాక్షిమాలిక్‌ను అక్కున చేర్చుకుంది.

**దీపా కర్మాకర్:** 6 సం॥ల నుండే క్రీడ పట్ల మక్కువ



చూపింది, క్రీడపై ఆసక్తితో తన ఫ్లాట్‌పాదాలను జిమ్నాస్టిక్స్‌కు వీలుగా మార్చుకుంది. ఈమె ఈశాన్యరాష్ట్రాలలో ఒకటైన త్రిపుర రాష్ట్రం నుండి వచ్చింది. ఒలంపిక్స్ బడిలో జిమ్నాస్టిక్స్ రంగంలో భారత్ నుండి మొదటి మహిళగా ఎన్నికైంది. ఇతర దేశాలతో పోలిస్తే మనదేశంలో ఈ క్రీడకు మౌలిక వసతులు చాలా తక్కువ. ఈ పరిస్థితులలో దేశాన్ని 4వ స్థానంలో నిలపడం మాకు మాత్రమే సాధ్యమని దీపాకర్మాకర్ చెబుతుంది.




**దీపామాలిక్:** ఈమె శరీరమే ఈమెకు ప్రతికూలం. నడుము క్రిందనుంచి ఈమె శరీరం పనిచేయదు. అన్నీ ఉన్న వారికన్నా నేనేమీ తక్కువకాదనే ఆత్మవిశ్వాసంతో షాట్‌పుట్‌లో రజకపతకం సాధించింది.

ప్రపంచస్థాయిలో పతకాలు రావాలంటే భారత్‌లో క్రీడా సంస్కృతి పెంచాలి. పాఠశాల స్థాయి నుంచి క్రీడలకు ప్రభుత్వ ప్రోత్సాహం తరతమ బేధం లేకుండా ఉండాలి. ఈ క్రీడా ప్రపంచంలో మహిళల ఆటకు మీడియా కవరేజీలో కూడా లింగవివక్షత ఉందా? నిర్మాణ విలువలు నాణ్యమైన కవరేజ్ ఉన్నతమైన కామెంట్రీలు, కెమేరాలు వివిధ కోణాలలో చూపించడం, అలాగే రీ ప్లే చూపించటం మొదలైనవన్నీ తక్కువగా ఉండటం వలన మహిళల ఆటలు ఉత్తేజాన్ని కలుగజేయవనే మరొక ఆలోచన కూడా ఉంది. ఆటలలో శారీరక బలాధిక్యత ఒక్కటే ఆటను గెలిపించదు. బంతిని గట్టిగా కొట్టడమే కాదు. ఎంత నైపుణ్యంగా అవతలి కోర్టులోకి పంపారన్న విఝయమే ప్రేక్షకులకు మరింత ఉత్సాహాన్ని ఇస్తుందనటంలో ఏమాత్రం సందేహం లేదు. ఇన్ని అడ్డంకులు, అవరోధాలు మధ్య వుండి కూడా మేమున్నామన్న మహిళలకు మంచి అవకాశాలు తోడైతే తప్పనిసరిగా మహిళా క్రీడాకారుల సంఖ్య పెరగడమే కాకా పోటీలో కూడా ముందుంటారు.



# గర్భిణి స్త్రీలు ఎలాంటి ఆహారం తీసుకోవాలి?



డా॥రమాదేవి జన విజ్ఞాన వేదిక

**నా** క్లినిక్‌కు వచ్చే గర్భిణీ స్త్రీలు చాల సమస్యలు చెపుతుంటారు. కాళ్లమంటలు, కాళ్ళు లాగడం, భోజనం సహించకపోవటం, వీపులో నొప్పి, నీరసం, నిద్ర పట్టకపోవటం లాంటివి సాధారణంగా ఎక్కువ మందిలో చూస్తుంటాను. ఇదే కాకుండా నెలలు నిండకుండానే కాన్పు కావటం, పిల్లలు తక్కువ బరువుతో బలహీనంగా పుట్టడం కూడా వుంటాయి. వీటన్నింటికీ కారణం ఆ సమయంలో సరైన తగినంత పోషకాహారం తీసుకోకపోవడమే చాల మందికి అవగాహనా లోపంతోనే ఈ సమస్యలు వస్తున్నాయి. అందుకే గర్భిణీ సమయంలో ఎలాంటి ఆహారం తీసుకోవాలో తెలుసుకుందాం. స్త్రీ గర్భం ధరిస్తే తన గర్భంలో వున్న పిండాన్ని కూడా పోషించాలి అందువ॥ ఆమె తీసుకునే ఆహారంపైనే బిడ్డ ఆరోగ్యం ఆదారపడి వుంటుంది. తల్లి ఆరోగ్యంగా వుండటానికి బిడ్డ బరువు సరిగా వుండటానికి ఇది ఎంతో అవసరం వుండవలసిన బరువు కన్నా బిడ్డ బరువు తక్కువైతే ఆ బిడ్డ అనారోగ్యానికి గురయ్యే అవకాశం ఎక్కువ.

**ఏరకమైన ఆహారం తీసుకోవాలి:-**

ఒక రోజుకు తీసకోవలసిన కనీస ఆహారం అన్నం, గోధుమలు, పప్పులు 400గ్రా నుండి 500గ్రా వుండాలి. నూనె గాని , నెయ్యిగాని దాదాపు 7 చిన్న స్పూన్లు వాడాలి. బెల్లం, పాలు, పెరుగు, చిక్కుళ్ళు, మాంసం, చేపలు, గ్రుడ్లు, పండ్లు, ఆకుకూరలు, ఇతర కాయగూరలలో కనీసం రెండుకూరలయినా తినే భోజనంలో వుండాలి. రోజుకు కనీసం ఎనిమిది గ్లాసుల నీళ్ళు త్రాగాలి. ఆహారం సరిగా జీర్ణం కావడానికి, మూత్రనాళపు ఇన్‌ఫెక్షన్ రాకుండా నీళ్ళు దోహదమవుతాయి.

**ప్రోటీన్లు:-**

గర్భిణీ స్త్రీలకు ప్రోటీన్ ఆహారం తప్పక అవసరం. మాంసం, చేపలు, గుడ్లు, పాలు, చిక్కుళ్ళలో ఇవి ఎక్కువగా వుంటాయి. రోజూ ఉదయాన్నే పాలు త్రాగుతూ, ధాన్యాహారంతో పాటు వీటిలో ఒక కూర రోజూ తినాలి. ఈ ప్రోటీన్లు శరీరంలో కణజాలం పెరగడానికి, బిడ్డ చుట్టూ మాయ గట్టిగా ఆరోగ్యంగా వుండటానికి, గర్భసంచి ఆరోగ్యంగా వుండటానికి ఉపయోగపడతాయి.

**విటమిన్లు:-**

ఆకుకూరలు, కాయగూరలు,పప్పు, పులుపు పండ్లు, పాలు, లివర్, పప్పులు వంటి ఆహారపదార్ధాలలో ఏ,బీ,సీ,డి అనీ విటమిన్లతో పాటు "ఫోలిక్ యాసిడ్" కూడా లభ్యమవుతుంది. రోజూ తీసుకునే ఆహారంలో ఇవి వుండేట్లు తీసుకోవాలి. లేకపోతే వారికి విటమిన్ల లోపం వలన రక్తంలేక పోవడం, నీరసం, రక్తహీనత, మల బద్ధకం ఏర్పడే అవకాశాలున్నాయి. వీటిని మాత్రలు, టానిక్‌ల కంటే ఆహార రూపంలో తీసుకుంటేనే మంచిది.

**ఐరన్:-**

ఆకుకూరలు, పప్పుధాన్యాలు, మాంసం, చేపలు, ముడిదాన్యాలలో ఇది ఎక్కువగా వుంటుంది. ఇవి రక్తంలో వుండే హీమోగ్లోబిన్‌కు చాల అవసరం. హీమోగ్లోబిన్‌లోని ప్రోటీన్లు, ఐరన్ కలిసి మన శరీరంలోని కణాలకు, బిడ్డ శరీరానికి ఆక్సిజన్‌ను సరఫరా చేస్తాయి.

బిడ్డపుట్టిన తర్వాత తల్లిపాలు దొరికేంత వరకూ సరిపోయేంత ఐరన్‌ను

తన కాలేయంలో దాచుకుంటుంది. కాబట్టి ఐరన్ ఎంతో అవసరం. స్త్రీలలో గర్భానికి ముందు శరీరకణంలోని ఐరన్ తక్కువగా వుంటుంది. అందుకే డాక్టర్లు గర్భిణీ స్త్రీలకు ఐరన్ టాబ్లెట్స్ ఇస్తారు. వీటిని తప్పనిసరిగా వాడాలి.

మన దేశంలోని స్త్రీలలో రక్తహీనత ఎక్కువ శాతం వుంది. ఎంత ఎక్కువంటే ప్రతి పదిమంది గర్భిణీస్త్రీలలో ఏడు మందికి రక్తహీనత వుంది అంటే తీవ్రతను అర్థం చేసుకోవచ్చు. అంతేకాదు గర్భం రక్తహీనతను ఎక్కువ చేస్తుంది. రక్తహీనత లేకుండా వుండాలంటే పాలకూర, మెంతి కూర, గోంగూర, పప్పులు, చిక్కుళ్ళు, బెల్లం, లివర్, మాంసం, చేపలు ఎక్కువగా తింటుండాలి.

**కాల్షియం:-**

ఇది పాలు, పప్పులు, పోపుగింజలు, మసాలా దినుసులు, ఆకుకూరలు, రాగులలో ఎక్కువగా వుంటుంది. ఇది తక్కువైతే నిద్రలేమి, చికాకు, కాళ్ళలో నొప్పులు, నరాల బాధ, గర్భసంచి కండరాలు నొప్పులుగా వుండటం మొదలైన లక్షణాలుంటాయి.

ఇలాంటి పరిస్థితుల్లో కాల్షియం మాత్రలు తీసుకోవాల్సిన అవసరం ఏర్పడుతుంది. ఈ మాత్రలను రోజూ ఉదయాన్నే పాలతో కలిపి వేసుకోవడం మంచిది. కాల్షియం, ఐరన్ రెండు మాత్రలను కలిపి ఒకేసారి వేసుకుంటే రెండూ పనిచేయవు. ఈ విషయాన్ని అందరూ గమనించాలి. అందుకే ఉదయం కాల్షియం మాత్ర వేసుకుంటే, సాయంత్రం లేదా రాత్రివేళ ఐరన్ మాత్ర వేసుకోవాలి.

# దు:ఖైరాంజీ

**డా॥ఎండ్లూరి సుధాకర్ మహారాష్ట్రలోని కిర్లాంజీ గ్రామంలో ఒక దళిత కుటుంబాన్ని సామూహికంగా చంపిన నేపథ్యంలో**

ఆ రాత్రి ఆకాశం నెత్తుటి వెన్నెల కురిసింది.
ఆ రాత్రి మట్టి మాంసం ముద్దగా మారింది.
ఆ రాత్రి నిలువెత్తు నీలి విగ్రహం నీరైపోయింది.
ఆ రాత్రి ఆత్మగౌరవం ఆయుధం కాలేక విలపించింది.

అంత దారుణం ఎంతలా జరిగి పోయింది.
ఒక ఆదిమ కాలపు
భయావహ జంతుజాలపు ఊచకోతల రక్తజ్వాల
కళ్ళ ముందు కదులుతున్నట్టే వుంది.

మేక పిల్లను కోసినట్టు,
కోడి పెట్టను గావు పట్టినట్టు
వేట కొడవళ్ళతో గాయపరిచినట్టు
దయలేని దేశంలో
నిర్ధయగా దళితుల్ని చంపడం
ఎంత తేలికైపోయింది.

గొడ్లు కోసే చేతికి కూడా
గుండె వుంటుంది కదా!
మాంసం కొట్టే కత్తికి సైతం
మనసు వుంటుంది కదా!

పూలు కోసే చేతులు
పూజలు చేసే చేతులు
పుణ్యం చేసే చేతులు
ఎంతపని చేశాయి?

హేరాం "వేధభూమి కూడా
ఎంత క్రూరభూమిగా రూపమెత్తింది.
కోమలతం కూడా రాక్షసత్వంగా మారిపోతుంది.
చంపండి, నరకండి,చావగొట్టండని
మగ, మధ మృగాల్ని"
ఎలా ఉసిగొల్పారమ్మా

**మిగిలిన తరువాయి.. 40వ పేజీలో**

# గిరిజనులకు అందని వైద్యం
# కంప్యూటర్ యుగంలో డోలీమోత

- సుజాత కుంచం



తెలుగుదేశం ప్రభుత్వం 2014 ఎన్నికల ప్రణాళికలో ప్రజల, గిరిజనుల ఆరోగ్యంపై ప్రభుత్వ ఖర్చు స్థూల ఉత్పత్తులో 3.6 శాతానికి పెంచి ఆరోగ్యవ్యవస్థను పటిష్టపరుస్తామని, ఐటిడిఏ ప్రాంతంలో ప్రత్యేక వైద్యాధికారిని, సిబ్బంది, మందులను ఏర్పాటుచేసి అటవీ ప్రాంత గిరిజనుల వైద్య ఆరోగ్యం కోసం ప్రత్యేక చర్యలు, ప్రభుత్వ ఆధ్వర్యంలో చౌకగా మందులు, ప్రతి మండల, పట్టణ కేంద్రాల్లో తక్కువ ధరలకు దొరికే జనరిక్ మందుల షాపులు ఏర్పాటు, ఇవేకాకుండా ఎన్‌టిఆర్ హెల్త్ కార్డ్, ప్రాథమిక ఆరోగ్య కేంద్రాల పటిష్టత, దేశీయ వైద్య సేవలకు ప్రోత్సాహం, ఉచిత పరీక్షలు, ఆపరేషన్లు అనేక వాగ్దానాలు చేసి ఎన్నికల్లో గెలిచింది. కాని నేడు రాష్ట్రంలో, గిరిజన ప్రాంతాల్లో జరుగుతున్న దేమిటీ? గిరిజనులు, ఆశ్రమ పాఠశాలలో విద్యార్థిని, విద్యార్థులు మృత్యువాత పడుతున్నారు. ఎన్నికల ప్రణాళికలో ఆరోగ్య రంగంలో అద్భుతాలు సృష్టిస్తామంటూ అధికారంలోకి వచ్చి ఆరోగ్యరంగాన్ని అనాథగా మార్చినవైనం మనకళ్ళ ముందు కన్పిస్తూనే వుంది.

తెలుగుదేశం అధికారంలో వచ్చాక ప్రభుత్వ ఆసుపత్రుల వసతులేక కునారిల్లుతున్నాయి. 104, 108 సర్వీసులను దిద్దుబాటు చర్యలు చేపట్టకుండా ప్రైవేట్‌శక్తులకు అప్పగించే ప్రయత్నాలు సాగుతున్నాయి. అంబులెన్స్‌లకు డిజీల్ కొరత, కాలం చెల్లిన అంబులెన్స్‌లతో మెరుగైన వైద్యం సకాలంలో అందించలేని పరిస్థితి. 108 చూడని గ్రామాలు వందలు సంఖ్యల్లో ఉన్నాయి. వేల మంది అతిసార, మలేరియా, డయేరియా, బాలింతలు, గర్భిణీలు సరైన వైద్యం అందక చనిపోతున్నారు. గత సంవత్సరంకంటే ఈ సంవ॥ మరణాలు పెరిగి ప్రమాదం వుంది. ముఖ్యంగా పరిశుభ్రమైన నీరు దొరకపోవడం, ఎండకాలంలో మంచినీటి ఎద్దడి వల్ల బురదనీరు ఆధారం. ప్రభుత్వ తప్పుడు విధానాలు, నాయకుల, అధికారుల నిర్లక్ష్యవైఖరి చిన్న చిన్న జబ్బులకు గిరిజనులు ప్రాణాలు కోల్పోతున్నారు. మిగతా జనాభాతో పోలిస్తే గిరిజన ప్రాంతంలో 27 శాతం శిశుమరణాలు అధికంగా నమోదవుతున్నాయి. ఐదేళ్ళ చిన్నారుల్లో 55 శాతం బాలురు, 50 శాతం బాలికలు ఉండాల్సిన దానికంటే బరువు తక్కువగా వున్నారు. 49 శాతం గిరిజన మహిళలు, 40 శాతం గిరిజనులు బలహీనంగా వున్నారు. వారు తీసుకుంటున్న ఆహారంలో మాంసకృత్తులు, కాల్షియం, విటమిన్లు తక్కువగా వుంటున్నాయి. అడవీలో పోడు వ్యవసాయంపై ఆధారపడిన గిరిజనులు తాము సేకరించే తేనే, పండ్లు, దుంపలు. పండించే పప్పు దినుసులు, చిరుదాన్యాలలో మంచిపోషకాలున్న, ఆహారలున్నా అవగాహనలోపంతో వాటిని సంతల్లో అమ్మేయ్యడానికే ఆసక్తి చూపుతున్నారు. ప్రపంచ ఆరోగ్య ప్రమాణాల ప్రకారం రోజు మనిషికి 40 గ్యాలన్ల నీరు అవసరం. అయితే గిరిజనులకు పరిశుభ్రమైన నీరు 4 గ్యాలన్ల కూడా దొరకటం లేదు. గిరిజన పిటిజిల పరిస్థితి మరింత దారుణం. వారు ఆసుపత్రికి వెళ్ళాలంటే 30, 40 కిలోమీటర్లు నడక ప్రయాణం, కొండలు ఎక్కి దిగి రోగికి డోలిమోత కట్టి తీసుకురావాలి తప్ప వేరేమార్గం లేదు. గర్భిణీలను ప్రసవానికి తీసుకొస్తున్న మార్గం మధ్యలో డెలివరీ అయి మరణించిన నమోదుకాని శిశుమరణాలెన్నో! దేశవ్యాప్తంగా చిన్నారుల మరణాల రేటు మైదాన ప్రాంతాలలో 10.3% వుంటే

గిరిజన ప్రాంతాల్లో 33.6% వుంది. వ్యాధినిరోధక టీకాలు, శ్వాసపునరుద్ధరణ పరికరాలను అందుబాటుల్లో లేదు. ప్రభుత్వాస్పత్రుల పట్ల నిర్లక్ష్యం వల్ల దిక్కులేని గిరిజనులకు భరోసాగా నిల్చే ఆ ఆస్పత్రులు ఇప్పుడు అసౌకర్యాలకు కేంద్రాలుగా మారాయి. రవాణా సౌకర్యాల్లేక, వైద్యులు సరిగా వెళ్లక, వెళ్లినా ఉండక గిరిజన ప్రాంతంలో వైద్య సేవలు గిరిజనులకు సవాల్‌గా మారాయి. ఇటువంటి పరిస్థితుల్లో పేదలు మెరుగైన వైద్యం కోసం పట్టణాల్లోని కార్పొరేట్, ప్రయివేటు ఆస్పత్రులను ఆశ్రయించాల్సివస్తోంది.

**పిహెచ్‌సిలపై అశ్రద్ధ చూపుతున్న రాష్ట్ర ప్రభుత్వం :** మన రాష్ట్రంలో ప్రధానంగా గ్రామీణ, గిరిజన ప్రాంతాలకు పెద్ద దిక్కుగా ఉన్న ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు(పిహెచ్‌సి), ప్రాంతీయ ఆరోగ్య కేంద్రాల్లో (సిహెచ్‌సి) వసతుల కల్పనపై శ్రద్ధ చూపడంలేదు. వైద్యులు, వైద్య సిబ్బందిని నియమించడంలేదు. మందులను సరిపడా సరఫరా చేయడంలేదు. రాష్ట్రంలో 1075 పిహెచ్‌సిలున్నాయి. వీటిలో 58 శాతం 24 గంటల ఆస్పత్రుల్లేవు. 88 శాతం పిహెచ్‌సిల్లో రెసిడెంట్ వైద్యుల్లేరు. 59 శాతం కేంద్రాల్లో మహిళా వైద్యుల్లేకపోవడంతో 53 శాతం పిహెచ్‌సిల్లో పది శాతానికి మించి మహిళలకు ప్రసూతి వైద్య సదుపాయం లభించడంలేదు. పిహెచ్‌సిల్లో వైద్యుల్లేకపోడంతో 77 శాతం ఇతర ఆస్పత్రులకు రోగులను పంపిస్తున్నారు. రాష్ట్రంలో 192 కమ్యూనిటీ హెల్త్ సెంటర్లలో వీటిలో 72 శాతం కేంద్రాల్లో రక్త నిల్వ సౌకర్యంలేదు. 14% కేంద్రాల్లో సర్జరీ సదుపాయాల్లేవు. 33% శాతం కేంద్రాల్లో పుట్టిన బిడ్డల సంరక్షణ, 59% కేంద్రాల్లో మహిళలకు వైద్యసేవలందించే గైనాకాలిజిస్టు వైద్యుల్లేరు. 71% కేంద్రాల్లో సర్జరీ చేసేటప్పుడు మత్తు ఇవ్వాల్సిన వైద్యుల్లేరు. జాతీయ గ్రామీణ ఆరోగ్య మిషన్, ప్రపంచబ్యాంకు నిధులతో కొన్ని చోట్ల పక్కా భవనాలు నిర్మించినా వాటిలో వైద్య సిబ్బందిని నియమించకపోవడంతో గ్రామీణ ప్రాంతంలో పేదలకు తగిన వైద్యసదుపాయం అందడంలేదు. విశాఖ జిల్లా ఏజెన్సీలో గిరిజనులకు వైద్యం మరింత దారుణంగా వుంది.

**మిగతా జనాభాతో పోలిస్తే గిరిజన ప్రాంతంలో 27 శాతం శిశు మరణాలు అధికంగా నమోదవుతున్నాయి. ఐదేళ్ళ చిన్నారుల్లో 55 శాతం బాలురు, 50 శాతం బాలికలు ఉండాల్సిన దానికంటే బరువు తక్కువగా వున్నారు. 49 శాతం గిరిజన మహిళలు, 40 శాతం గిరిజనులు బలహీనంగా వున్నారు. వారు తీసుకుంటున్న ఆహారంలో మాంసకృత్తులు, కాల్షియం, విటమిన్లు తక్కువగా వుంటున్నాయి. అడవిలో పోడు వ్యవసాయంపై ఆధారపడిన గిరిజనులు తాము సేకరించే తేనే, పండ్లు, దుంపలు. పండించే పప్పు దినుసులు, చిరుదాన్యాలలో మంచిపోషకాలున్న, ఆహారలున్నా అవగాహనలోపంతో వాటిని సంతల్లో అమ్మేయ్యడానికే ఆసక్తి చూపుతున్నారు.**

పాడేరు ఏజెన్సీ 11 మండలాల పరిధిలో 36 పి. హెచ్.సిలు, 194 సబ్ సెంటర్లు రెండు ఏరియా హాస్పిటల్ పరిధిలో 3300 వివిధ పోస్టులు ఉండగా సుమారు 800 పోస్టులు భర్తీ చేయటం లేదు. ఏజెన్సీలో 53 డాక్టర్ పోస్టులు ఉండగా, సగానికి పైగా పర్మినెంట్ డాక్టర్లు లేరు. దోమల పిచికారి లేకపోవడం వలన 41% మలేరియా కేసులు పెరిగింది. దంత వైద్యులు ఇద్దరు వుండగా ఒక్కరే వున్నారు. పోస్టులు భర్తీ లేదు. **మన్యంలో విద్యార్థుల** పరిస్థితి దయనీయంగా వుంది. ఆశ్రమ విద్యార్థులకు వైద్యసేవలు అందనంత దూరంలో వున్నాయి. మెరుగపడని వైద్యసేవలతో ఏటా కబళిస్తున్న వ్యాధులు. 2016 ఫిబ్రవరి నుండి మార్చి 15 వరకు 7 గురు విద్యార్థులు మృతి చెందారు. హెచ్‌బి స్క్రీనింగ్ ఆధారంగా విశాఖ ఏజెన్సీలో పాఠశాలలు 1875 వుండగా 95,412 విద్యార్థులకు 51,077 మందికి మాత్రమే రక్త పరీక్షలు చేసినట్లు ఆధారాలు వున్నాయి. 7.9 గ్రాములు కంటే తక్కువ వున్న వారు 6379 మంది, 8 నుంచి 9.4 గ్రాములు 26,747, 9.5 గ్రాములు దాటిన వారు 18.187 మంది విద్యార్థులున్నారు. పాఠశాలలో మరణాల సంఖ్య పెరగటంతో విద్యార్థులు తీవ్ర ఆందోళనకు గురవుతున్నారు. సీజన్‌లో గిరిజన ప్రాంతాల్లో గిరిజన సంఘం మారుమూల గ్రామాలకు ఉచిత వైద్యశిబిరాలు పెట్టి గిరిజనులను ఆదుకుంటోంది.

# ఆందోళన బాట పట్టిన గిరిజన మహిళలు

గిరిజన మిత్ర అస్సావ్ బ్యాంకు చెక్‌పవర్ వెంటనే అనుమతి ఇవ్వాలి. మంజూరైన పెట్టుబడి నిధి 91 లక్షలు 53వేలు వెంటనే విడుదల చేయాలి. బ్యాంకు అధికారులపై వెంటనే చర్యలు తీసుకోవాలి.

అరకువేలి, దుంబ్రిగుడ, అనంతగిరి మండల పరిధిల్లో గల డ్వాక్రాస్వయం సహాయ సంఘాలకు, రైతుమిత్ర గ్రూపులకు మరియు వ్యక్తి గత ఎకౌంట్‌లను ఆర్థికంగా తోడ్పాటు అందించుట కొరకు 2000 సం॥ల్లో అస్సావ్ మాక్స్ ఏర్పాటు చెయ్యడం జరిగింది. మాక్స్ పరిధిల్లో 600 స్వయం సహాయక సంఘాల్లో సుమారు 6000 మంది డ్వాక్రా సభ్యులుగా ఉన్నారు. వారు దాచిన పొదుపు డబ్బులు సుమారు 30లక్షలు వరకు ఉన్నాయి. ఇప్పటి వరకు వివిధ డ్వాక్రాగ్రూపులకు సుమారు ఒక కోటిన్నర రూపాయిలు వరకు రుణ సహాయం అందించియున్నాది. డ్వాక్రా సభ్యులకు ఆర్థికంగ సహయ సహకారం అందిస్తూ అస్సావ్ మ్యాక్స్ డ్వాక్రా సభ్యులకు సేవలందిస్తుంది.

ఎటువంటి ముందస్తు నోటీసులు ఇవ్వకుండా బ్యాంకును రద్దుచేయమనడం, లక్షలాది సొమ్ముని హోల్డ్‌లో పెట్టడం, గిరిజనులే కదా ఏమిచేయలేరన్న నిర్లక్ష్య దోరణి కనబడుతుంది. సంవత్సరంన్నర నుండి బ్యాంకు లావాదేవిలను అపివేయడం వలన గిరిజన మహిళలు అనేక ఆర్థిక ఇబ్బందులకు గురౌతున్నారు. పెరిగిన ధరలతో పోటీపడలేక మరోప్రక్క అనారోగ్యాలపాలై మహిళల బ్రతుకులు చిద్రమౌతున్నాయి.



**అధికారుల నిర్లక్ష్యధోరణి :** అనేక సార్లు ఐటిడిఏ పి.ఓ, కలెక్టర్, వెలుగు ఎపిడిఓ సంబంధించిన అధికారుల్ని కలిసిన చెప్పులు అరిగిపోయాయి కాని సమస్యల పరిష్కారంకాలేదు. పొదపుచేసిన సొమ్ము 30లక్షలు, రుణమాఫీ 91.33 లక్షల రూపాయలు ఇప్పిస్తామంటారు కానీ ఆచరణలో శూన్యం. పైగా ఛీత్కారాలు, తిట్లుతో సిబ్బందిని కించపరడం ఎంతవరకు సమంజసం. గిరిజన మహిళల్ని గౌరవిం చలేని దుస్థితి ఏజెన్సీలో నెలకొంది. అమాయక గిరిజన మహిళలకు ప్రభుత్వం తనవంతు సహాయం అందించకపోయినా తమ రెక్కల కష్టంతో పొదుపుచేసుకొని తమ అవసరాలకు ఉపయోగించుకుంటూ చాలా సమర్ధవంతంగా బ్యాంకు నడిపిస్తుంటే ప్రభుత్వానికి ఈర్ష్య ఎందుకు?

డ్వాక్రా ద్వారా సాధికారత సాధించ వచ్చని మాటలు చెప్పారు. ఆ దిశగా పనిచేస్తున్న ఆస్సావ్ బ్యాంకు గిరిజన మిత్రను మూసివేయమంటున్నారు. "అడగకపోతే అమ్మ ఐనా బువ్వపెట్టదు" అనే సామెతగా వుంది ప్రభుత్వ తీరు. ఇంత జరుగుతున్నా ఎంఎల్ఏ గారికి ఏమి పట్టలేదు. ఎ ఒకప్పుడు ఇదే ప్రభుత్వ అధికారులు మీ బ్యాంకును బాగానడిపించు కుంటున్నారు. మేము జాయింట్ అకౌంట్‌లో ఉందాము అని కాగితం వ్రాసి ఇచ్చేస్తామని చెప్పి ఇప్పుడు వేలాది మంది గిరిజన మహిళల్ని, గిరిజన రైతుల్ని ఇబ్బంది పెట్టడం వెనుక ఉన్న అంతర్యమేమిటో ఏలినవారే శెలవివ్వాలి.

ఆర్థికంగా, సామాజికంగా వెనుకబడి ఉన్న గిరిజనులకు ఇటువంటి సొసైటీల ద్వారా బలోపేతం చేయడానికి ప్రయత్నం చేయాలి. అవి చేయకపోగా గిరిజన మహిళలు తాము పొదుపుచేసుకున్న డబ్బుని కూడా తీసుకోకుండా అడ్డుపెట్టడం చూస్తే గిరిజనుల పట్ల ఎంతటి నిర్లక్ష్యదోరణి వుందో స్పష్టమౌతుంది. గిరిజన ఉత్పతుల్ని పొదుప

సంఘాల ద్వారా అమ్మించి వాళ్ళకు ఉపాధి కల్పించే విధంగా సొసైటీని తీర్చిదిద్దాలి. అప్పుడే గిరిజనులు తమ కాళ్ల మీద తాము ఆర్థికంగా నిలదొక్కగలరు.

సెల్ఫ్ హెల్ప్ గ్రూపుల ద్వారా మహిళలు సాధికారత సాధించాలని, మహిళల్ని లక్షాధికారుల్ని చేస్తానన్న ముఖ్యమంత్రి మాటలు నీటిమీద రాతలగానే మిగిలాయి. ఏడాదిన్నర నుండి అరుకులో వున్న అస్సావ్ బ్యాంకు లావాదేవీలను ఆపివేయడం వలన ఆన్‌లైన్ అయిన 379 గ్రూపుల పెట్టుబడి నిధి 91.53 లక్షలు మంజూరైన డ్వాక్రా అకౌంట్లకు వేయకుండా అధికారులు అన్యాయం చేసారు. సాక్షాతు ముఖ్యమంత్రి దత్తత మండలం అరుకువేలిలో 600 డ్వాక్రా గ్రూపులకు చెందిన 6వేల మంది డ్వాక్రా మహిళలు ఇబ్బందులు పడుతుంటే అధికారులు దున్నపోతు మీద వర్షంపడ్డ చందంగా వ్యవహరిస్తున్నారు.

గిరిజన సంఘం, ఐద్వా ఈ సమస్యపై పోరాటం చేయడం జరిగింది. పోరాటం ఫలితంగా ప్రభుత్వం వెలుగు డిఆర్‌డిఏ పి.డి సిబ్బందిని అప్రమత్తం చేసి సర్వేలుచేసి ఆగస్టు 20 నాటికి సమస్యను పరిష్కారం చేస్తామని వెలుగు సిబ్బంది, ఐద్వా, గిరిజన సంఘం నాయకులకు చెప్పారు.

# దు:ఖైరాంజీ

**36వ పేజీ తరువాయి..**

పైట జారాతేనే ఉలిక్కిపడి
పాతివ్రత్యానికి భంగం కలిగిందనుకునే
కులాంగనలు కదా!
సాటి స్త్రీ స్తనాలను
గొడ్డళ్ళతో అడ్డంగా నరుకుతుంటే
అడ్డుపడాల్సిందిపోయి తల్లీ,కూతుళ్ళను
కళ్ళేదుటే మానభంగం చెయ్యమని
మంత్రాలు పలికిన నోళ్ళతో
మద్దతునెలా పలికారమ్మా!

కత్తులతో, బరిసెలతో, కర్రలతో
ఊరు ఊరంతతతా పూనకంతో
శరీరాంగాల్ని, మర్మాంగాల్ని
పనసపొట్లులా తరుగుతుంటే
ఇంత దారుణాన్ని ఎంత నిబ్బరంగా
చూడగలిగారు తల్లీ?

రాక్షస స్త్రీలు కూడా మీ ముందు బాలాదూరే
అయ్యో? ఆపలేక పోయారా తల్లీ?
అపరదేవతల్లా మిమ్మల్ని పూజించే వాళ్ళం
ఏ ఆర్తానాదాలూ తల్లి పేగుల్ని వదిలించ లేదా తల్లీ
మీరు నడిచిన నెత్తుటి నేల మీద కాలు నిలపలేక
బహుశా దేవతలు కూడా ఆ రాత్రి శాశ్వితంగా
ఆర్య భూమి విడిచి పారిపోయుంటారు.

మాకు వతృత్వాల మీద మానవీయ మమకారాల మీద
మానవత్వాల మీద నమ్మకం పోయింది తల్లీ?
ఆడత్వాల వెనుక కూడా హిందూత్వాల
వర్ణతత్వాల శతృత్వాలుంటాయని
ఇంత కిరాతంకత్వం దాగుంటుందని
ఇప్పుడిపుడే తెలుసుకుంటున్నాం తల్లీ.

అమ్మా! మీరు మా ఊరి స్త్రీలకు ఆదర్శం కావొద్దు
అగ్నికి ఆద్యం పోసినట్టే వుంటుంది.
పల్లెల్లో, పేటల్లో, అంటరాని వీధుల్లో
మా శరీరాలు ప్రాణాలతో తారగవు.
మీగాలి సోకితే మా ఆడ బిడ్డలకు
ఎండిన స్తనాలు కూడా మిగలవు.

నరికిన నెత్తుటి ముద్దల్లాంటి ఆసుపత్రి ప్రాంగణాల్లో
మా బాలింతల రక్తాశృవులు కళ్ళల్లోంచి కాదు
పాల గుండెల్లోంచి వర్షిస్తున్నాయి.
భరతమాతా! దఖ:ంగా వుంది,
బాపూ! బాధగా వుంది.
బాబా! భగ భగ మండుతుంది.
ఏదైనా ఒక కొత్త దేశాన్ని సృష్టించుకోవాలని వుంది
ఆత్మ గౌరవంగా బతకాలని వుంది.

కనీసం అక్కడయినా
మా మర్మాంగాలు, దేహాంగాలు భద్రంగా వుంటాయి.

# ఉద్యమాల బాటలో..

**మద్యంపై :** విశాఖ జిల్లా భీమిలి మండలం చేపలుప్పాడ గ్రామంలో బెల్టుషాపును తొలగించాలని గ్రామ ప్రజలు చేస్తున్న పోరాటానికి ఐద్వా మద్దతు తెలుపుతూ ర్యాలీ, మద్యం బాటిళ్లను పగుల గొట్టడం జరిగింది.

మద్యం వ్యతిరేక కమిటీని ఏర్పాటు చేసి స్థానిక ఎంపిటిసి, ప్రెసిడెంట్ సహకారంతో ధర్నా జరిగింది. విశాఖ సిటీ స్టీల్‌జోన్ వడ్లమూడి ప్రాంతంలో బార్‌షాప్‌కు లైసెన్స్ ఇవ్వడాన్ని నిరసిస్తూ ఐద్వా జోన్ నాయకులు, కార్యకర్తలు ప్రజాసంఘాల నాయకులతో కలిసి దాదాపు నెలరోజుల పాటు స్థానిక మహిళలతో గ్రూపు మీటింగ్స్ నిర్వహించి 2000 సంతకాలు చేయించి జాయింట్ కలెక్టర్‌కు ఇచ్చి 150 మందితో ధర్నా నిర్వహించటం వలన ప్రస్తుతానికి షాప్‌ని పెట్టనివ్వకుండా ఆపగలిగారు.



**మహిళల హక్కుల సాదనలో అంబేద్కర్ కృషి ఆదర్శనీయం**

దేశంలో మహిళా సాధికారత కోసం అంబేద్కర్ విశేష కృషి చేశారని ఐద్వా నేత ఎమ్ రమాదేవి కొనియాడారు. అంబేద్కర్ 125వ జయంతిని పురస్కరించుకుని కాకినాడ మహిళా కళాశాలలో మహిళా సాదికారత- అంబేద్కర్ ఆలోచన అన్న అంశం పై నిర్వహించిన సదస్సులో ఆమె మాట్లాడారు. ఐద్వా జిల్లా సహాయ కార్యదర్శి కె. సుభాషిణి అధ్యక్షతన జరిగిన సదస్సులో ఆమె ప్రసంగించారు. మహిళలకు ఆస్తి హక్కు కల్పించడంలో రాజ్యాంగ నిర్మాతగా అంబేద్కర్ పాత్ర కీలకమన్నారు. హిందూకోడ్ బిల్లు పేరుతో మహిళలకు సమానత్వం కోసం ఆయన ఎంతో కృషి చేశారన్నారు. అంబేద్కర్ ఆశయ సాధన అత్యవసరమన్నారు. చట్టసభల్లో మహిళలకు 33శాతం రిజర్వేషన్ల అమలు ఇప్పటికీ కాలయాపన చేయడం ద్వారా ప్రభుత్వాలకు మహిళల పట్ల చిత్తశుద్ధి లేదని అర్థమవుతోందన్నారు. మహిళలంతా ఐక్యంగా హక్కుల సాధన కోసం సాగాలని పిలుపునిచ్చారు. కళాశాల అధ్యాపకులు కాంచనమాల, ఐద్వా నేతలు సుభాషిణి, భవాని తదితరులు మాట్లాడారు. మహిళా సాధికారత గురించి ఉపన్యాసాలు ఇచ్చే నేతలంతా ఆచరణలో మహిళలను అణచివేస్తున్నారని ఆందోళన వ్యక్తం చేశారు. మహిళల సమానత్వం కోసం ఐక్యంగా ఉద్యమించాల్సిన అవసరం ఉందన్నారు. మహిళల హక్కుల సాధనలో అంబేద్కర్ స్ఫూర్తితో ఐద్వా పోరాడుతోందన్నారు. అంబేద్కర్ ఆశయ సాధనలో భాగంగా సమానత్వం కోసం ఉద్యమిస్తోందని తెలిపారు. ఈ సదస్సులో పలువురు విద్యార్థినులు పాల్గొన్నారు.




**శిక్షణా తరగతులు:** తూ॥గో జిల్లా రాజమండ్రిలో ఒకరోజు 2 క్లాసులు 80 మందితో, జిల్లా క్లాసులు 2 రోజులు 50 మందితో జరిగాయి. ఒకపూట వర్క్‌షాపు జరిపి 25 మందితో కమిటీ ఏర్పాటు చేయటం జరిగింది. ప॥గోదావరి జిల్లా తణుకులో 80 మంది, ప్రకాశం 80 మందితో రెండు రోజులు క్లాసులు జరిగాయి. నిర్మాణంపై జిల్లాకమిటీ సభ్యులకు ఒక రోజు క్లాసు జరిగింది.

తూర్పుగోదావరి కాకినాడలో 80మందికి రెండురోజులపాటు క్లాసులు జరిగాయి. విశాఖ సిటీలో కొత్తవారితో స్టడీసర్కిల్ 30 మందితో, తూర్పుగోదావరి కాకినాడ, అమలాపురం, పిఠాపురం, జిల్లా సెంటర్‌లో స్టడీ సర్కిల్స్ ప్రారంభమయ్యాయి. విశాఖ జిల్లాలో స్టడీ సర్కిల్ ఒకరోజు 5 మందితో నిర్వహించారు.



**భూ సమస్యపై :** ఆక్వా ఫుడ్ పార్క్‌ను వ్యతిరేకిస్తూ భీమవరంలో ఇంటింటి ప్రచారం చేసి 700మంది మహిళలతో కార్యక్రమం నిర్వహించారు. ఈ సమస్యపై పనిచేసిన నాయకులు, సాధారణ కార్యకర్తపై ప్రభుత్వ నిర్బంధం కొనసాగుతూ ఉంది. సాధారణ గృహిణి సత్యవతమ్మపై క్రిమినల్ కేసులు పెట్టి జైలుకి పంపించారు. విచ్చలవిడిగా లాఠీ ఛార్జీ చేశారు. ఐద్వా రాష్ట్ర కార్యదర్శి డి.రమాదేవి మద్దతు తెలియజేయడానిక వెళ్ళిన సందర్భంగా ఆమెపై కూడా పోలీసులు విరుచుకుపడ్డారు. ప్రజాస్వామ్య హక్కులు కాలరాయబడుతున్నాయి. కాకినాడలో దివీస్ కంపెనీని వ్యతిరేకిస్తూ 3 గ్రామాలలో సమావేశాలు నిర్వహించి సెప్టెంబరు 6వ తేదీన ఇతర సంఘాలతో కలిసి సభ నిర్వహించారు. నాయకులను అరెస్ట్ చేశారు. పోలీసు రాజ్యం కొనసాగుతుంది. విశాఖజిల్లా భీమిలి మండలం తిమ్మాపురంలో 90 ఇళ్ళను కూల్చివేయటం జరిగింది. వీరంతా మత్స్యకారులు ఆ సమస్యపై కలెక్టర్ ఆఫీసు దగ్గర ధర్నాచేసి ఎమ్ఎల్ఏకు వినతిపత్రం ఇవ్వడంతో వారికి వేరేచోట ఇళ్ళు ఇస్తామని హామీ ఇవ్వటం జరిగింది. చిత్తూరు జిల్లా రేణిగుంటలోఇళ్ళ స్థలాల పోరాటానికి వెళ్ళి మద్దతు తెలిపి వారితో కమిటీ ఏర్పాటు చేసారు. చింతూరులో పోడుభూములపై సర్వేచేసి పట్టాలివ్వాలని ఐటిడిఎ ఎదుట ధర్నా చేసారు.

**డ్వాక్రాపై :** పుష్కర పనులు డ్వాక్రా మహిళలకు కేటాయించాలని డిమాండ్ చేస్తూ విజయవాడ కార్పొరేషన్ ఆఫీసు వద్ద డ్వాక్రా మహిళలతో ధర్నా జరిగింది. 50మంది మహిళలు పాల్గొన్నారు. విశాఖ అరకు మండలంలో అస్సావ్ మాక్స్ సొసైటీ మహిళలు ఋణమాఫీ రిలీజ్ చేయాలని ఆపివేసిన చెక్‌పవర్‌ని తిరిగి పునరుద్ధరించాలని ఐద్వా, గిరిజన సంఘ ఆధ్వర్యంలో 8 రోజులపాటు రిలే నిరాహార దీక్షలు చేసి ఋణమాఫీని సాధించుకోవటం జరిగింది. చెక్‌పవర్‌పై అంగీకార ఒప్పందం కుదిరింది. భద్రాచలంలో 160 మందితో డ్వాక్రా ఋణమాఫీ, సబ్సిడీ లోన్లు ఇవ్వాలని ఆర్‌డీవో ఆఫీస్ ముట్టడి చేసి ఆర్‌డివోకి వినతి పత్రం ఇవ్వటం జరిగింది. విజయనగరం జిల్లా బొబ్బిలిలో 4వ వార్డులో 80 గ్రూపులు, 3 టీమ్‌లుగా చేసి 40 మందితో సదస్సు పెట్టారు. ఎమ్ఆర్‌వో ఆఫీసు వద్ద 20 మందితో ధర్నా జరిగింది. పీతానగరంలో డ్వాక్రా సమస్యలపై బ్యాంకు వద్ద 50 మందితో ధర్నా చేశారు.



**సెప్టెంబరు 2 సమ్మె:-** సెప్టెంబర్ సమ్మె సందర్భంగా రాష్ట్రంలో అన్ని జిల్లాల్లో 40,000 కరపత్రాలు వేసి ఆయా జిల్లాల్లో శ్రామిక మహిళలకు పంచడం జరిగింది. ఈ సందర్భంగా జనరల్ బాడీలు, గ్రూపు మీటింగ్స్ వేయటం జరిగింది. ప్రెస్‌మీట్ పెట్టటం జరిగింది. ఐద్వాగా పాదయాత్రలు చేయటం జరిగింది. ప్రదర్శనలో ఐద్వాగా

జెండాలు, బ్యానర్లతో పాల్గొన్నాము. ఈ సందర్భంగా రాష్ట్ర రంగాలలో పనిచేసే మహిళలే కాకుండా కొత్త సెక్షన్లలోకి వెళ్ళటం ద్వారా శ్రామిక మహిళలతో సంబంధాలు పెంచుకోవటం జరిగింది. విజయవాడ నగరంలో టైలరింగ్, బైండింగ్, చుట్టల కంపెనీ, నెయ్యి కంపెనీ, కబేళా, కర్జూర కంపెనీ, బిల్డింగ్ పనిచేసేవారి సమస్యలపై గ్రూపు మీటింగులు జరిగాయి. 6 డివిజన్‌లలో ఇంటిపనివారల సమావేశాలు 8 డివిజన్‌లలో జరిగాయి. విశాఖ సిటీలో సెప్టెంరు 2 సమ్మెను పురస్కరించుకొని మెర్సి కుట్టియమ్మ వచ్చిన సందర్భంగా 70 మందితో శ్రామిక మహిళల సమన్వయ కమిటీ, ఐద్వా కలిపి సెమినార్ పెట్టటం జరిగింది.

**అధిక ధరలకు నిరసనగా:-** విజయవాడలో 7 డివిజన్లలోను మరియు రైతు బజారు వద్ద అధిక ధరల పైన ధర్నా జరిగింది. విశాఖ సిటీలో 'మోయలేని భారాలు- చాలీచాలని వేతనాలు' స్లోగన్‌తో కావిడితో ప్రదర్శన జరిగింది. ఈ కార్యక్రమానికి 25 మంది మహిళలు పాల్గొన్నారు.

పుష్కరాల సందర్భంగా పర్యావరణ పరిరక్షణకు వ్యర్థ పదార్థాల తొలగింపు, చిన్న పిల్లలు తప్పిపోకుండా ట్యాగ్‌లు కట్టడం వంటి సేవా కార్యక్రమాలను ఐద్వా కమిటీ చేపట్టింది. ఈ సందర్భంగా 450మంది టిఫిన్స్ పంచిపెట్టడం జరిగింది

**స్థానిక సమస్యలపై :** తూ॥గో జిల్లా ధవళేశ్వరం గ్రామంలో కోల్డ్ స్టోరేజ్ (బీఫ్ ఫ్యాక్టరీ)లో పనిచేస్తున్న 15 మంది మహిళలను పనిలోనుంచి తీసేస్తే దానికి నిరసనగా వారు 4రోజులు ఫ్యాక్టరీ దగ్గర ఇందోళనకు ఐద్వా మద్దతు తెలిపింది. వారికి ఐద్వా మీద మంచి అభిప్రాయం కలగటం వలన ఐద్వా చేసే అన్ని కార్యక్రమాలలో పాల్గొంటామన్నారు. అత్తింటివారు కాపురానికి తీసుకెళ్ళటం లేదని యువతి అత్తింటివారిముందు ఆందోళన చేస్తే ఆ కార్యక్రమానికి పూర్తి మద్దతు తెలియజేసి ఆమెతో పాటు ఐద్వా బృందంగా కూర్చోవటం జరిగింది. గోవును చంపి చర్మం తీస్తున్నారని దాడి చేసిన ఘటనకు నిరసనగా తూర్పుగోదావరి జిల్లా కాకినాడలో ప్రజాసంఘాల అధ్వర్యంలో రౌండ్‌టేబుల్ సమావేశం నిర్వహించి 5,000 కరపత్రాలు పంపిణీ చేశారు. తూర్పుగోదావరిజిల్లా(కాకినాడ)లో దళిత ఆత్మగౌరవ సభ ఐక్య కార్యాచరణ ఆధ్వర్యంలో 5,000మందితో జరిగింది.

విశాఖ జిల్లా అనంతపురం మండలం పెద్దిపాడు గ్రామంలో భర్త రెండవ పెళ్ళికి సిద్ధమయిన నేపథ్యంలో అత్తింటి ముందు నిరసన తెలియజేస్తున్న యువతికి ఐద్వా మద్దతు తెలిపింది. అమలాపురంలో గో ఘటనపై దళితులపై జరిగిన దాడికి నిరసనగా అన్ని ప్రజా సంఘాలతో పాల్గొనటం జరిగింది. ప॥గోదావరిజిల్లా పాలకొల్లులో లోవోల్టేజి సమస్య,పాఠశాలల సమస్య, ఆకివీడు భీమవరంలో మంచినీటి సమస్య, డ్రైనేజి సమస్యలపై, గ్రామ సభలలో ఇళ్ళ స్థలాల సమస్యలపై అర్జీ ఇవ్వటం జరిగింది. కర్నూలుజిల్లాలో తాగునీరు, మరుగుదొడ్లు, రోడ్ల సమస్యలపై ఐదు ఏరియాల మహిళలను సమీకరించి మునిసిపల్ కమిషనర్ కార్యాలయం వద్ద ధర్నా జరిగింది. విజయవాడలో 5 డివిజన్లలో మంచినీటి సమస్యపై ధర్నాలు జరపటంతో సమస్య పరిష్కారమయింది. విశాఖజిల్లా

**దివీస్ ఫార్మా కంపెనీకి వ్యతిరేకంగా:-** దివీస్ ఫార్మా కంపెనీ ఏర్పాటును వ్యతిరేకిస్తూ పెద్ద ఎత్తున పోరాటం జరుగుతోంది. ఐద్వాగా ఆయా గ్రామాల్లో సమావేశాలు జరుపుతూ 6 కమిటీలు ఏర్పాటుచేశారు. ఆరుగురు కార్యకర్తలు ఆ గ్రామాలలో కృషి చేస్తున్నారు.

**జీడిపిక్కల సమ్మె:** విశాఖజిల్లా నర్సీపట్నం ,రోలుగుంటు, మాకవరపుపాలెం మండలాల్లో జీడిపిక్కల ఫ్యాక్టరీలో పనిచేస్తున్న 3000 మంది మహిళా కార్మికులు జీతాలు పెంచాలని, పిఎఫ్, ఇఎస్ఐ ఇవ్వాలని సమ్మె జరుగుతూ వుంది. వారికి మద్దతుగా ఐద్వా రాష్ట్ర అధ్యక్షురాలు ప్రభావతిగారితో పాటు ఐద్వా నాయకులు కె. ద్రాక్షాయణి, కె. నాగరాణి, ఎల్.గౌరి, మాణిక్యం, సూర్యప్రభ, కె.ప్రసన్న మొదలగువారు గ్రామాలలో వారితో పాటు బసచేసి ఆ సమస్యల పరిష్కారం కోసం పూర్తి మద్దతు తెలియచేస్తూ వారికి అండగా వున్నారు. ఈ సందర్భంగా కొన్ని ప్రాంతాలలో పోరాట

కమిటీలు వేయడం జరిగింది. ఐద్వా విస్తరించింది. యాజమాన్యం మొండివైఖరికి నిరసనగా పట్టు సడలకుండా 2 నెలలుగా సమ్మె చేస్తున్నారు.

**రైల్వే జోన్/హోదా:** విశాఖ రైల్వే జోన్, ప్రత్యేక హోదా ఇవ్వాలని ఐద్వా, డివైఎఫ్ఐ, సిఐటియు కలిసి ప్రెస్‌మీట్ మరియు ప్రజాబ్యాలెట్ నిర్వహించారు. కొవ్వాడ అణువిద్యుత్‌కి వ్యతిరేకంగా గ్రూప్ మీటింగ్స్ పెట్టటం జరిగింది.



**సిహెచ్‌సిల సర్వే:** విశాఖ సిటీలో 3 సిహెచ్‌పిల సర్వే చేశారు. రూరల్, అరకులలో 3 సిహెచ్‌సిలలో సర్వే జరిగింది. సర్వేలో అనేక సమస్యలు వెలుగు చేశాయి. తగిన సిబ్బంది లేకపోవటం, బిల్డింగ్స్ ఉన్నా వసతులు లేకపోవటం, విషజ్వరాల భారినపడి నెలకు 5నుండి 10 మంది వరకు చనిపోతున్నారు. రోగులు తమకొచ్చిన ఆదాయంలో 3వ వంతు ఖర్చు పెట్టాల్సి వస్తుందని తమ గోడును వెళ్ళడించారు. ఏరియా హాస్పిటల్స్ పరిధిలో లక్షల మంది రోగులు ఉన్నారు. వీరికి ప్రభుత్వ ఆసుపత్రిలో వైద్యం అందని ద్రాక్షాగా మారింది. విజయవాడ నగరంలో ప్రాధమిక ఆరోగ్య కేంద్రాలు ప్రైవేటీకరణ చేయరాదని ప్రెస్‌మీట్ పెట్టి 5డివిజన్‌లలోని ఆరోగ్య కేంద్రాలలో ధర్నాలు చేసారు. విజయనగరంలో సిహెచ్ సర్వేచేసారు. గిరిజన ఆశ్రమ పాఠశాలలు, హాస్టల్స్‌లో నెల నెలా వైద్యపరీక్షలు నిర్వహించాలని పార్వతీపురం ఏరియా ఆసుపత్రిలో సూపరింటెండెంట్‌ను నియమించాలని సాలూరు సిహెచ్‌సినిఏరియా ఆసుపత్రిగా మార్చాలని బొబ్బిలిలో ఆసుపత్రి పడకలు పెంచాలని శానిటేషన్ వర్కర్స్‌ని నియమించాలని వినతిపత్రం ఇచ్చారు. ఆంధ్ర, కురుపట్టి, నంద, దుగ్గేరు, వేటగాని వలస, కొదరి పురంలలో పిహెచ్‌సిలు పెట్టాలని డిఎమ్ హెచ్‌ఓకు వినతిపత్రం ఇవ్వటం జరిగింది.

**రియో ఒలంపిక్స్:** రియో ఒలంపిక్స్‌లో సింధు రజత పతకం సాధించినందుకు తిరుపతిలోఅభినందనలు తెలుపుతూ జాతీయ పతాకంతో డివైఎఫ్ఐతో కలిసి 500 మంది విద్యార్థులతో ప్రదర్శన చేశారు. విశాఖలో గాంధీ విగ్రహం నుండి గురజాడ విగ్రహం వరకు ర్యాలీ నిర్వహించారు.

**సి.ఐ.టి.యు:–**




మతోన్మాదము రాజ్యమేలుతున్న ప్రస్తుత పరిస్థితులలో స్త్రీల హక్కులు, కార్మికుల హక్కులు కుదించబడుతున్నాయని ఐద్వా, శ్రామిక మహిళా సంఘం ఉమ్మడి కార్యాచరణను మరింత పెంపొందించుకోవాలని ఆరకంగానే కనీం ఉన్న హక్కుల్ని

నిలబెట్టుకుని పురోగమించగలమని ఐద్వా అఖిల భారత కమిటీ నుండి డి.రమాదేవి పేర్కొన్నారు. ఇంటిపనికి విలువ కట్టని నేపథ్యంలో బిడ్డల పెంపకం, ఆహారపోషణ, ఆరోగ్యం కోసం పని చేస్తున్న అంగన్ వాడీ, మధ్యాహ్న భోజనం, ఆశా, ఐ.కె.పి, తదితర కార్య కర్తలకు నామ మాత్ర వేత నాలు లేదా వేతనాలే ఇవ్వక పోవడం జరుగు తుందని కనీస వేతనాల కోసం ప్రభుత్వ విద్య వైద్యరంగా సేవలకోసం కృషి చేసి సాధించుకోవడం ద్వారా మాత్రమే మహిళలకు ఊపిరి పీల్చుకునే అవకాశం కలుగుతుందని అందుకోసం కలిసి పోరాడదామని పిలుపునిచ్చారు. సెప్టెంబర్ 28,29తేదీలలో గుంటూరులో శ్రామిక మహిళల అఖిల భారత కన్వెన్షన్ అత్యంత ఉత్సాహ పూరితంగా జరిగింది. ఐద్వా అఖిల భారత కమిటీ నుండి డి.రమాదేవి ఈ సభలలో పాల్గొని సంఘీభావం తెలియజేశారు.

**స్కూల్స్, హాస్టల్స్ సమస్యలపై:** తూ။గో జిల్లా రాజమండ్రిలో స్కూల్ కంటింజెంట్ వర్కర్స్ సమస్యపై పెండింగ్ జీతాలివ్వాలని కమీషనర్‌కు సిఐటియు, ఐద్వా ఆధ్వర్యంలో వినతిపత్రం ఇప్పించటం జరిగింది. రాజమండ్రిలో మున్సిపల్ స్కూల్లో గతంతో పోలిస్తే విద్యార్థుల సంఖ్య తగ్గింది. దీనికి కారణం ఈ స్కూల్ చుట్టూ 2,3 ప్రైవేటు స్కూల్స్ ఉండటమే. గర్ల్స్ హైస్కూల్ నిర్మాణం 3సం॥ల నుండి పూర్తికాకపోవటం వలన పిల్లల సంఖ్య పెరిగినందువలన పక్కన హాస్టల్లో కూర్చోవటానికి స్థలం లేక ఆడపిల్లలకు నాప్‌కిన్స్ రాక ఇబ్బందిపడుతున్నారు. నర్సీపట్నం మండలం వేములపూడి పంచాయితీలో గర్ల్స్ హాస్టల్ డి.వై.ఎఫ్.ఐ, ఐద్వా ఆధ్వర్యంలో సర్వే జరిగింది అనేక సమస్యలు వెలుగులోనికి వచ్చినవి: మెనూ ప్రకారం భోజనం పెట్టడంలేదు. బాత్‌రూంలు క్లీన్‌చేసే తోటీ లేకపోవటం వలన బాత్‌రూం శుభ్రం చేసేపని పిల్లలే చేసుకుంటున్నారు. హాస్టల్స్‌లో ఆడపిల్లలకు ఆరోగ్య సమస్యలకు సలహాలు ఇచ్చేందుకు నర్స్ లేరు. నీటివసతి లేకపోవడం వలన పిల్లలకు గజ్జి తో బాధపడుతున్నారు. వార్డెన్ పిల్లలకు అందుబాటులో ఉండటం లేదు. పై సమస్యలపై ఆర్.డి.వోకు వినతిపత్రం ఇవ్వటం జరిగింది. ఆర్‌డివో వెంటనే స్పందించి హాస్టల్‌ను సందర్శించి సమస్యల పరిష్కారానికి చర్యలు తీసికోవలసిందిగా వార్డెన్‌ను ఆదేశించారు. విజయవాడలో ఎస్‌సి హాస్టల్ సర్వే చేసి మంచినీరు, కరెంటు, బాత్‌రూమ్‌లలో లైట్లు మొదలగు సమస్యలను పరిష్కరించటం జరిగింది.

**గురజాడ జయంతి :** గురజాడ జయంతి సందర్భంగా విశాఖ సిటీలో 12 స్కూల్స్‌లో వ్యాసరచన, పాటల పోటీలు నిర్వహించి ప్రైజ్‌లు, సర్టిఫికెట్స్ ఇవ్వడం జరిగింది. సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో ఆర్‌టిసి కాంపెక్స్ వద్ద 65 మందితో గురజాడ విగ్రహం వద్ద దేశభక్తి గీతాలాపన జరిగింది. విశాఖ జిల్లాలో 4 కాలేజీల్లో, 3 స్కూల్స్‌లో సెమినార్లు , వ్యాసరచన పోటీలు నిర్వహించి ప్రైజులు ఇచ్చారు.సదస్సు జరిగింది. విజయనగరంలో శిశు భ్రూణహత్యలపై సెమినార్ జరిగింది. 4 కాలేజీలలో 620 మందితో సెమినార్లు నిర్వహించారు. విజయవాడ నగరంలో అన్ని మహిళా సంఘాలతో కలిసి సభ నిర్వహించటం జరిగింది. చిత్తూరు జిల్లాలో గురజాడ జయంతి సభ 2000 మందితో ఎస్‌పిడబ్ల్యు జూనియర్ కళాశాలలో సదస్సు జరిపారు. ప్రముఖ రచయిత రాసాని వెంకటరామయ్య గారు పాల్గొన్నారు.

**హింసపై :** విజయనగరంలో బైబిల్ యూనివర్శిటీ పిడి విద్యార్థినిపై లైంగిక వేధింపులకు నిరసనగా ఎస్ఎఫ్ఐతో కలిసి 4 సెంటర్లలో ర్యాలీ, రాస్తారోకో జరిపి కలెక్టర్‌కు వినతిపత్రం ఇవ్వడంతో విచారణ జరిపి దోషిని అరెస్టు చేశారు. విజయవాడ నగరంలో ప్రభుత్వ ఆసుపత్రిలో బాబు కిడ్నాప్ అయిన ఘటనలో ఐద్వా రెండు రోజులపాటు ఆందోళన కార్యక్రమం చేపట్టింది. ఎట్టకేలకు కిడ్నాపర్‌ను అరెస్టు చేసి బాబును తల్లిదండ్రులకు అప్పగించారు. తేజస్విని భర్త చేతిలో దాడికి గురైనది. ఐద్వాగా ఆందోళన చేయడం ద్వారా భర్తను అరెస్టు చేయించడం జరిగింది. అరుణకుమారి అను యువతి షాపు ఎంప్లాయిగా పనిచేస్తుండగా

షాపు యజమాని మోసం చేసి హత్య చేసిన ఘటనలో రాస్తారోకో జరపటం, నిందితుని అరెస్టు చేయించటం జరిగింది. కనకదుర్గ టెంపుల్‌లో శానిటేషన్ వర్కర్స్‌ను వేధింపులకు గురిచేస్తున్న కాంట్రాక్టర్‌పై పోలీసు స్టేషన్‌లో కేసు నమోదు చేసి వర్కర్స్‌కు మద్దతుగా ఆందోళనలో ఐద్వా పాల్గొన్నది. కేసు విచారణ జరుగుతోంది. విశాఖ రూరల్‌లో కొత్తకోట మండలంలో ప్రేమించి పెళ్ళి చేసుకొని భర్త వదిలివేస్తే కెవిపిఎస్, ఐద్వా పోలీసు స్టేషను ముందు ధర్నా చేసి నిందితునిపై కేసుపెట్టించటం జరిగింది.



**అభినందనలు :** జెఎన్‌యును అభ్యుదయ విద్యార్థి సంఘాల విజయం. మతతత్వ ఎబివిపికి చెంపపెట్టు. విజయం సాధించిన విద్యార్థినీ విద్యార్థులకు ఐద్వా అభినందనలు తెలియజేస్తుంది.



మన్నవరంలో బిహెచ్ఇఎల్ ఫ్యాక్టరీని రాజస్థాన్‌కి తరలించడానికి బిజెపి గవర్నమెంట్ సందర్భంగా వెంకయ్య నాయుడు పర్యటనను నిరసిస్తున్న సాయిలక్ష్మి అరెస్టు



పోలీస్ కానిస్టేబుల్స్ మోడల్ పరీక్ష డివైఎఫ్ఐ ఆధ్వర్యంలో పరీక్ష పత్రాన్ని విడుదల చేస్తున్న డిఎస్పీ

మద్యం మత్తు మందు నుండి భారత ప్రజలు విముక్తి చెందాలని ప్రభుత్వం మద్యంపై నిషేధం విధించాలని కోరుతూ ప్రజా సంఘాల ఆధ్వర్యంలో ఐక్య వేదిక విజయవాడలో 6-10-16వ ఎం.బి.వి.కెలో సదస్సు జరిగింది. ఆంధ్రరాష్ట్రంలో మద్యం తుఫాను ప్రజల ప్రాణాలు తీస్తుందని, ఎన్టీఆర్ పెట్టిన మద్య నిషేధాన్ని బాబు ఎత్తివేశాడని ప్రజలు మద్యంతో యువకులుగానే చనిపోవడంతో మహిళలు, బిడ్డలు తీవ్రమైన బాధలకు గురౌతున్నారని పేర్కొన్నారు. ఈ సదస్సులో ఐద్వా కార్యదర్శి రమాదేవి మాట్లాడుతూ రిలయన్స్, జియో స్కీములతో సెక్సువల్ వీడియోలతో యువతను నిర్వీర్యం చేసే కుట్రలు సాగుతున్నాయని ఐక్యంగా ఇలాంటి దుర్వాసనాలకు వ్యతిరేకంగా పోరాడాలని పిలుపునిచ్చారు.



మానవి డెస్క్

# పితృస్వామ్యంపై ఎక్కుపెట్టిన బాణం 'పింక్'



పితృస్వామ్య సమాజం మానవ వికాసానికి, ఎదుగుదలకు, ఒక న్యాయ బద్ధమైన సమసమాజ ఏర్పాటుకు ఎంతో చేటు తెచ్చింది. వ్యక్తి గత ఆస్తి, పురుషాధిక్య భావజాలం ఒక గొప్ప నాగరిక మానవ సమాజం ఏర్పడడానికి ఆటంకం అయింది. కాని ఈ మనవ సమాజం అభివృద్ధి చెందాలి. తేడాలు లేని సమాజాన్ని ఏర్పాటు చేసుకోవాలి. న్యూనతా భావంతో కాక రేపు(భవిష్యత్తు) లోకి ధైర్యంగా తొంగి చూడాలి అనుకునే బుద్ధి జీవులు గానే ఉన్నారు. ఆ దిశలో ప్రయాణం చేస్తున్నారు. ఈ తేడాలు, ఈ వివక్షలు ముఖ్యంగా స్త్రీల విషయంతో పూర్తిగా ప్రతిబింబిస్తున్నాయి.

దీని మీద సామాజికదృక్పథం ఉన్న ప్రతి కళాకారుడు, రచయిత స్పందిస్తూనే ఉన్నారు. 19వ శతాబ్దంలో హెండ్రీ ఇబ్సన్ ఒక గొప్ప నాటకాన్ని రాశాడు. అది "డాల్స్ హౌస్". ఆ నాటకం, పురుషుడికొక న్యాయాన్ని స్త్రీ కొక న్యాయాన్ని ప్రశ్నిస్తుంది.

నేటికీ స్త్రీలు బాహటంగా, నవ్వుతూ గట్టిగా మాట్లాడటం, రాత్రుళ్ళు తిరగటం, పబ్‌లకు వెళ్ళటం, పొట్టి దుస్తులు వేసుకోవడం ఇలాంటి చాలా విషయాలమీద పురుషాధిక్య ప్రపంచ భావజాలమే నడుస్తుంది. అది న్యాయమేనని కొందరు స్త్రీలు కూడా భావిస్తున్నారు.

నేటి సమాజంలో ఎవరైతే పీడింపబడుతున్నారో వాళ్ళు పీడనను కూడా ప్రపంచంలో సాధారణ వ్యవహారంగా అమోదిస్తారు.

స్త్రీ కేవలం బానిసగా, సౌందర్య వస్తువుగా చూడబడ్తుంది. స్త్రీకి తన స్వంత నిర్ణయాధికారం లేకుండా చేయడానికి అంతకు ముందు ప్రయత్నాలే కాక ఇప్పుడు కూడా ఆ ప్రయత్నాలు బలీయంగా జరుగుతున్నాయి. ఈ పితృస్వామ్య భావజాలంపై ఎక్కుపెట్టిన బాణమే పింక్ చిత్రం.

జీవనభృతి కోసం, కుటుంబ పోషణ కోసం పట్టణాలకు వస్తున్న, ఉద్యోగాలు చేస్తున్న యువతులు భయంకరమైన వివక్షకు, వేదనకు గురవుతున్నారు. ఈ పింక్ సినిమా ఈ పరిస్థితులను అద్భుతంగా చిత్రీకరించింది. ఇలాంటి సినిమాలే దాదాపు రెండు దశాబ్దాల కింద "జొడీ ఫోస్టర్"(జొనాథన్ కప్లాన్) "ది అక్యూజ్డ్"అనే సినిమా తీసింది. దాని పేరు "ది అక్యూస్డ్". స్త్రీకి ముఖ్యంగా తను ఒక పురుషుడితో సంగమించే విషయంలో పూర్తి నిర్ణయాధికారం ఉందని చెప్పింది.

అలేగే ఈ పింక్ సినిమా బతకడానికి ఉద్యోగాల్లో చేరిన 3గ్గురు యువతుల కధని చాలా హృద్యంగా, మనసుకి హత్తుకునే విధంగా చెప్పింది.

మగవాళ్ళలాగానే ఆడవాళ్ళకు కూడా కుటుంబ బాధ్యత ఉంటుంది. ఆధునిక సమాజంలో అలాంటి అమ్మాయిలు అనునిత్యం రకరకాల వేధింపులను, వివక్ష, అవమానాలను ఎదుర్కుంటున్నారు.. ఆ యువతులు పడే సంఘర్షణను కళ్ళకు కట్టినట్లు చూపించింది పింక్.

కథలోకి వెళితే ముగ్గురు ఢిల్లీ అమ్మాయిలు మినాల్(తాప్సీపన్ను), పాలక్(కీర్తి), ఆంద్రేయ(ఆంద్రేయ) లు వేరు వేరు కార్పొరేట్ సంస్థల్లో పని చేస్తూ ఒక అపార్ట్‌మెంట్‌లో నివసిస్తూ ఉంటారు. వారికి పరిచయం అయిన ముగ్గురు యువకుల ఆహ్వానంతో రిసార్ట్‌కు వెళ్తారు. అక్కడ రాజ్‌వీర్(అంగద్). రాజ్‌వీర్ స్నేహితులు వారితో వ్యవహరించే తీరును తిరస్కరిస్తారు. రాజ్‌వీర్ బలవంతం చేయబోయినపుడు తప్పించుకునే క్రమంలో మినాల్ బాటిల్‌తో రాజ్‌వీర్ తలపై కొట్టి తప్పించుకుంటుంది.

ఆ చేదు అనుభవాన్ని మరిచిపోయే ప్రయత్నం చేస్తారు స్నేహితురాళ్ళు. కాని రాజ్‌వీర్ తండ్రి రాజకీయంగా పలుకుబడి కలిగిన వాడు. ఈ విషయాన్ని సీరియస్‌గా తీసుకుంటాడు. వారిని అద్దె ఇంటి నుండి ఖాళీ చేయించే ప్రయత్నం చేయగా మినాల్ బృందం గత్యంతరం లేక పోలీస్ కంప్లెయింట్ ఇస్తారు. రాజ్‌వీర్ స్నేహితులు మరింత కక్షతో మినాల్‌ను కారులోకి బలవంతంగా ఎక్కించుకుని అత్యాచారం జరిపి తిరిగి మినాల్ పైనే హత్యా యత్నం కేసు పెడతారు. మినాల్‌ను పోలీసులు అరెస్టు చేస్తారు. బెయిల్ కోసం ఫలక్ ,ఆంద్రియాలు చాలా ఇబ్బందులు పడతారు.

దీపక్ షహగల్(అమితాబ్ బచ్చన్) ఆ అమ్మాయిల బాధలు గమనిస్తాడు. భార్య సేవలో ఉన్న అమితాబ్ మళ్ళీ తిరిగి కోటు వేసుకుంటాడు.

కోర్టులో దోషుల తరపు న్యాయవాది అవమాన కరమైన ప్రశ్నలు వేస్తాడు. రాత్రిపూట పని చేయటం, ఆలస్యంగా ఇంటికి రావడం, పొట్టి బట్టలు వేసుకోవడం, తల్లిదండ్రులకు దూరంగా ఉండడం, డ్రింక్ పోసి ఇవ్వడం, డాన్స్‌పార్టీలకు వెళ్ళడం, తిరుగుబోతు లక్షణాలనీ, డబ్బుకోసం గొప్పింటి అబ్బాయిలను పడగొడతారని ఎంతకైనా తెగిస్తారని వాదిస్తాడు.

దీపక్ సెహగల్ సమాజంలోని తిరోగమన పోకడలను తన వాదనలతో తిప్పి కొడతాడు. భారత దేశంలోని రూల్ బుక్‌లో కొత్తరూల్స్ పెట్టాలని అవి. 1. అమ్మాయిలు ఎవరితోనూ స్నేహపూర్వకంగా నవ్వరాదనీ, 2. మద్యం సేవించడం, అర్ధరాత్రి ఇంటికి రావడం మగవారు చేస్తే తప్పులేదని అమ్మాయిలు మాత్రం అలా చేయడం తప్పనీ, 3. పార్టీలకు వెళ్ళడం గొప్పింటి వారు చేయవచ్చని సగటు కుటుంబాలు చేయరాదంటూ వ్యంగ్యాస్త్రాలు సంధిస్తాడు.

రాజ్‌వీర్ లాయర్ పదే పదే మినాల్ డబ్బు తీసుకుని వ్యభిచారానికి ఒప్పుకుందని వాదిస్తాడు. మినాల్‌ను రాజ్‌వీర్ అత్యాచారం చేయబోతుండగా నివారించమని అడుగు తాడు. దీపక్ "వద్దు "అన్నానని అంటుంది. ఈ కేసు విషయంలో తుది తీర్పు ఇవ్వడానికి "వద్దు" అనే ఒక్క మాట చాలుననీ ఎవరైనా సరే ఒక మహిళ తాను వద్దు అని చెప్పిన తరువాత గర్ల్ ఫ్రెండ్ అయినా, భార్య అయినా, చివరకు వ్యభిచార వృత్తి చేసే స్త్రీ అయినా సరే ఆమెకు ఇష్టం లేకుండా ఆమె పై చేయి వేసే అధికారం ఎవరికీ లేదని, మినాల్ తనను ముట్టుకోవద్దని వారించిన రాజ్‌వీర్ ఆమెపై అత్యాచారానికి యత్నించడం నేరం అని వాదిస్తాడు. నేరస్తులందరికీ శిక్ష పడుతుంది.

చిత్రంలో అనేక సామాజిక రుగ్మతలను దర్శకుడు ప్రతిభావంతంగా ఎత్తి చూపారు. సమాజంలో ఆడపిల్లల పట్ల వారు ఎంత క్రమ శిక్షణగా ఉన్నా కూడా ఎలాంటి చులకన భావాలు ఉంటాయో, నగరాల్లో ఉద్యోగినుల పరిస్థితులు ఎలా ఉంటాయో సజీవంగా చిత్రీకరించారు. పి.కె, మద్రాస్ కేఫ్ లాంటి సినిమాలను నిర్మించిన షుజిత్ సర్కార్ మరో మంచి సినిమాను నిర్మించారు. అనిరుద్ చౌదరి దర్శకత్వం వహించిన ఈ సినిమాలో అమితాబ్‌తో పాటు అమ్మాయిల నటన కూడా బాగా హిట్ అయింది. మ్యూజిక్ షోనీ చక్కగా మలిచింది.

రెండవ భాగంలోని కోర్టు సీన్‌లు అంత సహజంగా లేవు. అయినప్పటికి అమితాబ్ నటన దానిని అధిగమించింది. యువత ఈ సినిమాను బ్రహ్మాండంగా ఆదరిస్తు న్నారు. మగవాళ్ళకు, ఆడవాళ్ళకు విలువలు ఒకటేనని అసభ్యతకు అశ్లీలతకు తావు లేకుండా ఉత్కంఠ భరితంగా సాగే పింక్ చిత్రం ఒక మంచి చిత్రం చూసిన అనుభూతిని కలిగిస్తుంది.



# CH. RAVI KUMAR B.com.,

Dy. Suprident of Police, Guntakal ATP.

1. JOINED TN THE DEPARTMENT : 1989 DIRECT SI OF POLICE.
2. REPORTED FOR DUTY AS DSP, GTL ON 14.02.2014
3. PREVIOUS WORKING PLACES AS INSPECTOR OF POLICE,

   DHARMAVARAM (R): PENUKONDA, GUNTAKAL
4. NATIVE PLACE: CUDDAPAH

49

# పేదరికంపై గెలుపు - మహిళా సాధికారితే మా లక్ష్యం



# 2015-16 సం॥లో డి.ఆర్.డి.ఎ - వెలుగు, అనంతపురం జిల్లా నందు సాధించిన ప్రగతి

- బ్యాంకు రుణాల మంజూరులో గతంలో ఎన్నడూ లేని విధంగా మార్చి 2015-16 నాటికి 931 కోట్లు మంజూరు చేసి గతంలో ఎన్నడూ లేని విధంగా జిల్లాను ముందుంచడం జరిగినది.
- ఎన్టీఆర్ భరోసా ఫించన్లు పంపిణీలో అనంతపురం జిల్లా రాష్ట్రంలో 3 రోజులలో సత్వరమైన విన్నూతమైన, పారదర్శకంగా పంపిణీ చేసినందులకు జిల్లా కలెక్టర్ వారు మరియు సెర్ప్, సి.ఈ.ఓ. వారిచే మన్ననలు పొందడం జరిగినది.
- స్వయం సహాయక సంఘాల గ్రేడింగ్ నందు జిల్లా రాష్ట్రంలో 2 స్థానంలో ఉన్నది.
- ఉన్నతి మరియు ఎస్సీ మరియు ఎస్టీ కార్యక్రమాల అమలులో రాష్ట్రంలో 3వ స్థానంలో ఉన్నాము.
- స్త్రీనిధిలో 2015-16 సం॥కి 60 కోట్లు లక్ష్యం కాగా 100% లక్ష్యాన్ని సాధించడం జరిగినది.
- వ్యవసాయేతర జీవనోపాధుల విభాగంలో డిసెంబర్ 2015 నాటికి ప్రకటించిన ర్యాంకులో రాష్టంలో మొదటి స్థానంలో వునానము.
- రూరల్ రిటైల్ చైన్ విభాగం రాష్టంలో అనంతపురం జిల్లా ప్రధమ స్ధానంలో నిలిచినందుకు ప్రాజెక్ట్ డైరెక్టర్ వారికి రాష్ట స్థాయి అవార్డును 08-03-2016 వ తేదీన గౌరవ ముఖ్య మంత్రి చేతుల మీదుగా అందుకోవడం జరిగినది.
- ఆగస్టు 2015 స్వాతంత్యదినోత్సవం సందర్భముగా ఉత్తమ తృతీయ శకటంగా మరియు రిపబ్లిక్ డే 2016 సందర్భముగా ఉత్తమ ప్రధమ శకటంగా వరుకసగా బహుమతులు అందుకోవడం జరిగినది.
- జిల్లాలో కదిరది ఏరియా పరికధవిలోని జెండర్ ప్రత్యేక ప్రాజెక్టు మరియు జెండర్ కార్యక్రమాలను జిల్లాను ముందుంచడం జరిగినది.
- వ్యవసాయ అనుబంధ జీవనోపాధుల విభాగంలో రరాష్టంలోనే ఉత్తమ ప్రగతి సాధించడం జరిగినది.
- 20000మంది రకైతులకు వర్మికంపోస్టు యూనిట్లు మంజూరు చేయడం జరిగింది.

సం./- యం. వెంకటేశ్వర్లు, ప్రాజెక్ట్ డైరెక్టర్ డి.ఆర్.డి.ఏ-వెలుగు, అనంతపురము.

# శ్రీ వెంకటేశ్వరస్వామి వారి దేవస్థానం




ద్వారకా తిరుమల(చిన్న తిరుపతి), పశ్చిమగోదావరి జిల్లా - 5344226.

ఫోన్: విచారణ: 08829-271427, దేవస్థానం: 08829-271469.

కార్య నిర్వహణాధికారి: 08829-271436, ఫ్యాక్స్: 271766

website : www.dwarakatirumala.org, email : eo_dwaratirumala@yahoo.co.in


## శ్రీ స్వామివారి విమాన గోపుర స్వర్ణమయ పథకము

ద్వారకా తిరుమల క్షేత్రము పురాణ ప్రసిద్ధమైన త్రేతాయుగము నుండి దశరథ మహారాజు, శ్రీరామచంద్రమూర్తి మొదలగు పురాణ పురుషులచే ఆరాధించబడిన ప్రసిద్ధ పురాతన క్షేత్రము, ద్వారక మహర్షి తప: ప్రభావ ప్రకటితమయిన ఈ క్షేత్రమే చిన్న తిరుపతి, అట్టి ఈ క్షేత్రములోని శ్రీ వెంకటేశ్వర స్వామివారి ఆలయ విమానము (గుడి గోపురము)నకు బంగారు తాపడము చేయాంచాలని శుభసంకల్పం చేయడం జరిగినది. శ్రీ స్వామివారి దర్శనం కానివారు దూరం నుండే స్వామివారి గుడి శిఖరాన్ని దర్శించుకుంటే స్వామివారిని దర్శించిన పుణ్యం కలుగుతుందని శాస్త్రవచనము. అట్టి పవిత్రమైన శ్రీ ద్వారకా తిరుమలేశుని విమాన గోపురానికి బంగారు తాపడం చేయడానికి దాతల నుండి ధన, వస్తు రూపేణ విరాళములు సేకరించడం జరుగుచున్నది. దాతలు రూ.1116/- లు ఆపై విరాళములు చెల్లించి చరిత్రలో శాశ్వతంగా నిలబడి ఉండే ఈ బృహత్ కార్యక్రమంలో పాలుపంచుకుంటారని కోరుచున్నాము. విరాళములు కార్యనిర్వహణాధికారి, శ్రీ వెంకటేశ్వరస్వామివారి దేవస్థానము, ద్వారకాతిరుమల, ప॥గో॥జిల్లా పేరున పంపవచ్చును.

### గోసంరక్షణ పథకము

గోవులయందు సర్వదేవతలు కొలువైయున్నారు. గోపూజ, గోప్రదక్షిణ చేయండి. సమస్త శుభఫలితాలను పొందండి. రూ.1116/-లు ఆ పైన విరాళములు చెల్లించగలరు దాతలు శ్రీ వెంకటేశ్వరస్వామివారి దేవస్థానం.

### శాశ్వత అన్నదాన పథకము ట్రస్ట్

| | |
|---|---|
| 1. మహాఅన్నదాత | :రూ.3,65,000/-లు మరియు ఆపైన |
| 2. మహారాజ పోషకులు | : రూ.1,00,000/-లు మరియు |
| 3. రాజపోషకులు | :రూ.50,000/-లు నుండి రూ.1,00,000/-లు లోపు |
| 4. పోషకులు | : రూ.10,000/- నుండి రూ.50,000/-లు లోపు |
| 5. దాతలు | :రూ. 10,000/-లోపు చెల్లించువారు ఆలయ ప్రాంగణ |

ములోని అన్నదాన భవనములో ఉదయం 10 గంటల నుండి సాయంత్రం 4 గంటలలోపు కార్యాలయంలో సంప్రదించవలెను.

**పై రెండు పథకములకు విరాళములు ఇచ్చు దాతలకు ఇన్‌కమ్‌టాక్స్ యాక్ట్‌లోని సెక్షన్ 80(జి) క్రింద మినహాయింపు కలదు**

### శ్రీ వేంకటేశ్వరస్వామివారి ప్రాణదాన ట్రస్ట్

దేవస్థానం ఆధ్వర్యంలో కుల, మత, వర్ణ, వర్గ, విభేదాలు లేకుండా ఉచితముగా వైద్య సేవలు అందించుటకు సంజీవిని ట్రస్టు నెలకొల్పబడినది. క్యాన్సర్, గుండె, మెదడు, మూత్రపిండాలు మొదలగు వ్యాధులతో బాధపడుచూ ఖరీదైన వైద్యము చేయించుకోలేని వారికి మరియు స్వామివారిని దర్శించిన భక్తులకు వైద్యసేవలు అందించుట ట్రస్ట్ ప్రధాన లక్ష్యం. కావున దాతలు తమ విరాళములను కార్యనిర్వహణాధికారి. శ్రీ వేంకటేశ్వరస్వామి వారి దేవస్థానం(చిన్నన తిరుపతి) లేదా సంజీవిని మెడికల్ ట్రస్ట్ పేరున ద్వారకాతిరుమలలో చెల్లు విధముగా బ్యాంకు/డి.డి./చెక్కు/యం.ఒ.ద్వారా పంపవచ్చును. పూర్తి వివరములకు దేవస్థానం కార్యాలయంలో సంప్రదించగలరు.

**గమనిక** : శ్రీ స్వామి వారి అశ్వయుజ మాస తిరు కళ్యాణ మహోత్సవములు ది.11.10.2016 నుండి ది.18.10.2016 వరకు.

**కళ్యాణము** : ది. 15.10.2016 రాత్రి 9గం॥లకు:, రథోత్సవము ది.16.10.2016 రాత్రి 7గం॥ల నుండి.

**ఎస్.వి.సుధాకరరావు**
అధ్యక్షులు మరియు వ్యవస్థాపక ధర్మకర్త

**ఎస్.వి.పి.జి.గోపాలరావు**
వ్యవస్థాపక ధర్మకర్త

**వేండ్ర త్రినాధరావు**
కార్యనిర్వహణాధికారి మరియు సంయుక్త కమిషనర్.



| | |
|---|---|
| | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | CMV01A153 |
| పుస్తకం పేరు | చైతన్య మానవి |
| తారీఖు | 21/08/2023 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 61 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Nandini |
| పేజీలు విడదీసినది | Nandini |
| స్కాన్ చేసినది | Sandhya |
| పరీక్ష చేసినది | AMRUTHA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good |